# సిద్ధాంతము:

# అసలైన పార్లే క్రాక్‌జాక్ బిస్కట్ ఏదో కనిపెట్టడం, హెచ్చుతగ్గుల్లేకుండా చతురస్రాన్ని గీయడంకన్నతేలిక.



పార్లే గ్లూకో పార్లే మొనాకో పార్లే క్రాక్‌జాక్

## మూల సిద్ధాంతము: కరకరలాడే గుణం తాజాదనాలతో పాటు ప్రజాభిమానం చూరగొన్నవిగనక పార్లే బిస్కట్లకు నకిలీవిచేసే వారెందరో ఉన్నారు.

దీనిని ఋజువు చేసేందుకు : మీరు పార్లేలా కనిపించే బిస్కట్‌ని తయారుచేయొచ్చేమోగానీ, అదే రుచిగల బిస్కట్‌ని మాత్రం కాదు.

ఋజువు : ఎ) కొంటున్నప్పుడు పరీక్ష :
మొదట గుర్తుంచుకోవాల్సిన విషయం : పార్లే క్రాకజాక్ బిస్కట్లు ఎప్పుడూ విడిగా అమ్మబడవు. ఇవి, అనుకరింపబడలేని తాజాదనాన్ని నిలబెట్టుకునేందుకుగాను ఆరోగ్యకరమైన రీతిలో ప్యాక్ చేయబడిన రంగురంగుల ప్యాక్‌లలో వస్తాయి.

బి) ప్యాకేజ్ పరీక్ష :
ఆకర్షణీయమైన పార్లే క్రాక్ జాక్ బిస్కట్ ప్యాక్‌ను ఏ బీరువాలో ఉన్నా ఇట్టే సులభంగా గుర్తు పట్టవచ్చు. మరింత ఖచ్చితంగా తెలుసుకునేందుకుగాను ప్యాక్‌పై P-A-R-L-E అని ఉందో చూడండి.




సి) రుచి చూసి పరీక్ష :
ఓ బిస్కట్‌ని కాస్త కొరికి చూడండి. పార్లే క్రాక్ జాక్‌కి ఉండాల్సిన, మీకు తెలిసిన ఆ కరకరలాడే గుణం, తాజాదనం ఉందా మరి?

ఋజువు కాబడింది

**వీటన్నిటినీ కలిపి కూడితే వచ్చేది బిస్కట్లు ఇచ్చే మహదానందం.**

# చందమామ

ఫిబ్రవరి 1980

★

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు












అమ్మా,అమ్మా! మాకు
బబుల్‌గమ్‌పెట్టవా
అమ్మా

007
బబుల్‌గమ్

ఒకే




ఉత్పాదన

Imageads-NP 3




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''పితృవాక్య పాలన'']కు ఆధారం బొమ్మిడి అచ్చారావు రచన. ఏ కాలంలోనైనా, ఎలాంటి పరిస్థితులలోనైనా మనిషి పాటించవలసిన ధర్మాలు అనేకం ఉండి, వాటిమధ్య ఘర్షణ వస్తుంది. అప్పుడు సరి అయిన ధర్మాన్ని నిర్ణయించటం అవసరం. అందుకోసం ధర్మసూక్ష్మం తెలుసుకోవాలి. ఇదే ఈ కథ చెబుతుంది.

## అమరవాణి

నమంతి ఫలితా వృక్షాః, నమంతి చ బుధా జనాః;
శుష్క కాష్ఠాని, మూర్ఖాశ్చ భిద్యంతే న నమంతి చ.

[ఫలించే చెట్లు వంగుతాయి, బుద్ధిమంతులు వంగుతారు: (నమ్రత కలిగి ఉంటారు.) కాని ఎండు కర్రలూ, మూర్ఖులూ విరిగి అయినా పోవచ్చుగాని, వంగటం ఉండదు.]

సంపుటి 66 ఫిబ్రవరి '80 సంచిక 2

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00




లక్ష్మణ, హళ్యూర (కర్ణాటక)

ప్ర: అశోకుడూ, కనిష్కుడూ భారతదేశంలోని అన్ని ప్రాంతాలలోనూ, ఇతర దేశాలలోనూ బౌద్ధమతం ప్రచారం చేశారు. కాని భారతంలో బౌద్ధమతము ఎందుచేత తగ్గిపోయినది? జైనమతం ఎందుచేత మిగిలి ఉన్నది?

న: బౌద్ధం చక్రవర్తిత్వానికి అనుకూలమైన మతమని చెబుతారు. సామ్రాజ్యాలు స్థాపించిన మగధ రాజులు తాము స్వయంగా బౌద్ధమతం పుచ్చుకున్నా, పుచ్చుకోకపోయినా, బౌద్ధాన్ని ఆదరించి ప్రోత్సహించారు. బౌద్ధం హింసతో పనిలేకుండా సామ్రాజ్యాన్ని నిలబెట్టుతుందని అశోకుడు తన కాలంలో రుజువుచేశాడు. అహింస ద్వారా ప్రచారమైన ప్రపంచవ్యాప్త మతం బౌద్ధం తప్ప మరొకటి లేదు. సామ్రాజ్యాలు పోయి ప్రాంతీయ రాజరికాలు వెలిసినాక బౌద్ధం అంతరించింది మన దేశంలో. వర్ణ వ్యవస్థతో రాజీపడని కారణంగా బౌద్ధం ఈ దేశంలో నిలవలేకపోయిందనీ, జైనం రాజీపడి నిలవగలిగిందనీ చెబుతారు. అందుకే జైనం దేశాంతరాలలో వ్యాపించ లేదట.

బి. నారాయణరావు, చీపురుపల్లి. (ఆంధ్ర)

ప్ర: ఉదయించే, లేక అస్తమించే సూర్యుడు, ఉదయించే, లేక అస్తమించే పున్నమి చంద్రుడు ఎర్రగా ఉండుటకు కారణమేమి?

న: ఉదయించే సూర్య చంద్రుల కాంతికిరణాలు భూమిని చేరటానికి భూమి చుట్టూ ఉండే గాలి పొరలో చాలా హెచ్చు దూరం ప్రయాణించాలి. అందుచేత సూర్యరశ్మిలో చేరి ఉండే రంగురంగుల కిరణాలు గాలిలో చెదిరిపోతాయి. అన్నిటికన్న ఎక్కువ దూరం సూటిగా ప్రయాణించగలవి అతి దీర్ఘ తరంగాలు గల ఎర్రని కిరణాలు. వాటినే మనం ఉదయాస్తమయాలలో చూస్తాం. ధ్వనితరంగాలకు కూడా ఇదే వర్తిస్తుంది. దూరం నుంచి వచ్చే "బాండు" మేళంలో మొదట మనకు వినిపించేవి "డ్రమ్" మోతలు. ధ్వనితరంగాలన్నిటిలోకీ అతి దీర్ఘమైనవి అవే.

అదే విధంగా సూర్యకాంతిలో అతి సులువుగా చెదిరిపోయేవి అతి హ్రస్వమైన నీలం కాంతి తరంగాలు. గాలిపొరనిండా అవి చెదరి ఉండటం చేత ఆకాశం నీలంగా ఉన్నట్టు కనిపిస్తుంది. కాని నిజంగా ఆకాశం నల్లగా ఉంటుంది.



## 80

అతిలోభి గాలిమేడలు అన్న కథ విని, "ఆ బ్రాహ్మణుడు కూడా ఫలించని కోరికల వెంట పరిగెత్తి, తనకు ఉన్నది కూడా పోగొట్టుకున్నాడు," అన్నాడు.

"నిజమే. అయితే ఆ బ్రాహ్మణుడు పోగొట్టుకున్నదీ, ఒంటినిండా పోసుకున్నదీ పేలపిండి మాత్రమే. కాని నేను పోగొట్టుకున్నది బంగారం, ఒంటినిండా పోసుకున్నది రక్తం! ఎంత ఆలోచించినా మనిషి ప్రారబ్ధాన్ని నిర్ణయించేది విధేగాని, వాడి మంచి చెడ్డలు కావని నమ్మకం కలుగుతున్నది," అన్నాడు అత్యంతలోభి.

అతిలోభి, "మిత్రమా, ఈ చక్రం నీ నెత్తిని మథించుతూ, రక్తం చిందిస్తూండటం చూస్తూంటే నాకు వెర్రెత్తి, కోతి బాధ చూడలేక పారిపోయిన రాక్షసుడి లాగా నాక్కూడా పారిపోవాలనిపిస్తున్నది," అని, అత్యంతలోభి అడిగిన మీదట ఆ కథ ఇలా చెప్పాడు:

### మోసపోయిన రాక్షసుడి కథ

ఒక నగరంలో భద్రసేనుడు అనే రాజు ఉండేవాడు. అతనికి రత్నవతి అనే సర్వలక్షణ సంపన్న అయిన కూతురు ఉండేది. ఆమెను ఒక రాక్షసుడు ప్రేమించి, ఎత్తుకుపోవటానికి ప్రయత్నించాడు. కాని ఆమె రాక్షసనిరోధోపాయాలు అనుసరించటం చేత వాడికి ఆమెను హరించటం సాధ్యం కాలేదు.

ఒకసారి వాడు రహస్యంగా పొంచి ఉండగా, రాజకుమార్తె తన చెలికత్తెతో, "సఖీ, ప్రతి రోజూ ప్రదోషరాక్షసుడు నన్ను వేధిస్తున్నాడు. వాణ్ణి ఎలా నిరోధించటం? ఎంత ఆలోచించినా తెలియకుండా ఉన్నది." అన్నది.



రాక్షసుడు ఆ మాట విని, "ఈమెను నాలాగే మరో రాక్షసుడు కూడా ప్రేమిస్తున్నాడు. ఈమె నన్ను నిరోధించినట్టుగా వాణ్ణి నిరోధించలేకుండా ఉన్నదన్నమాట. వాడి సంగతి ముందు చూడాలి," అనుకుని, ఒక గుర్రం రూపం ధరించి అశ్వశాలలో చేరాడు.

ఆ రాత్రి ఒక గుర్రాల దొంగ రాజుగారి అశ్వశాలలో ప్రవేశించి, అన్ని గుర్రాల కన్న పుష్టిగానూ, ఆకర్షణీయంగానూ ఉన్న మాయగుర్రాన్ని ఎక్కి పారిపోసాగాడు.

తాను దొంగిలించిన గుర్రం వేగంగా పరిగెత్తుతూండటం చూసి దొంగ మొదట సంతోషించినా, తరవాత భయపడి, పగ్గాలు పట్టుకుని గట్టిగా లాగాడు. గుర్రం వేగం తగ్గకపోగా మరింత హెచ్చింది. ఎందుకంటే తనను ఎక్కినవాడు ప్రదోష రాక్షసుడని రాక్షసుడికి అనుమానమూ, భయమూ కలిగి, శక్తికొద్దీ పరిగెత్తసాగాడు.

అలాగే దొంగ కూడా భయపడ్డాడు. ఎందుకంటే పగ్గాలు బిగలాగినకొద్దీ మరింత వేగంగా పరిగెత్తే గుర్రాన్ని వాడు ఎన్నడూ చూసి ఉండలేదు.

"ఇది గుర్రం కాదు. ఏదో పిశాచం అయి ఉండాలి." అనుకుని వాడు, దారిలో దొరికిన మర్రిఊడలు పట్టుకుని పైకి ఎక్కాడు.

ప్రదోషరాక్షసుడు వదిలినందుకు గుర్రం రూపంలో ఉన్న రాక్షసుడు కూడా సంతోషించాడు.

అయితే ఆ చెట్టు మీదనే పైకొమ్మలలో ఉన్న కోతి, తన మిత్రుడైన రాక్షసుడు గుర్రం రూపంలో ఉండటం తెలుసుకుని, "నీ మీద స్వారి చేసినవాడు మనిషే! వాడు నీకు సహజమైన ఆహారం! వాణ్ణి ఎందుకు మోశావు?" అని అడిగింది.

కోతి అన్న ఈ మాట విని, కోతితోక పుచ్చుకొని, లాగి, దాన్ని చెట్టుపంగలో ఇరకబెట్టి పీడించుతూ, దాని తోక కొరక

సాగాడు, దొంగ. కోతి ఆ బాధ భరించ లేక, చాలా భయం కలిగించే మొహం పెట్టింది.

అది చూసి రాక్షసుడు, "ఈ ప్రదోష రాక్షసుడు ఎంతటి భయంకరుడో నీ ముఖం చూస్తేనే తెలుస్తున్నది. వాడికి అందను," అంటూ పారిపోయాడు.

అతిలోభి ఈ కథ విని, "విధి అనుకూలిస్తే హత్యాప్రయత్నాలు కూడా, గుడ్డివాడికీ, గూనివాడికీ, మూడు స్తనాలు గల రాజకుమార్తెకూ లాగ మేలు చేస్తాయి," అన్నాడు అత్యంతలోభి.

"మిత్రమా, ఆ కథ ఏమిటి?" అని అతిలోభి అడగగా, అత్యంతలోభి ఇలా చెప్పాడు:

త్రిస్తని అయిన రాజకుమార్తె కథ

మధుర రాజు మధుసేనుడు. అతనికి మూడు స్తనాలు గల కుమార్తె పుట్టింది. ఇలాంటి విడ్డూరమైన కూతురు పుట్టినట్టు విని రాజు ప్రతీహారితో, "ఈ బిడ్డ నాకు కనిపించరాదు. ఆమెను తీసుకుపోయి ఏ అరణ్యంలోనో వదిలిరా." అన్నాడు.

దానికి ప్రతీహారి, "మహారాజా, మూడు స్తనాలు గల కూతురువల్ల తండ్రికి చెరుపు అని నేనూ విన్నాను. అయినా లోకనిందా, వచ్చే జన్మలో పాపఫలమూ అనుభవించకుండా ఉండగలందులకు తమరు విజ్ఞులైన బ్రాహ్మణుల సలహా పొందటం మంచిది. శ్రద్ధగా విచారించి, ఆలోచించే వాడి బుద్ధి, సూర్యకిరణాలకు పద్మం



వికసించినట్టు వికసిస్తుందంటారు. అందుచేత అజ్ఞానంలో ఉండి, అసహాయుడైనవాడు ఎడతెగక ప్రశ్నించాలి. వెనకటికి ఒక బ్రాహ్మణుడు ఒక్క ప్రశ్నతో తనను ఆవహించిన భూతాన్ని వదలగొట్టుకున్నాడట," అన్నాడు.

"ఆ కథ ఏమిటి?" అని రాజు అడిగాడు.

ప్రతీహారి ఇలా చెప్పాడు:

ఒక భయంకరమైన అరణ్యంలో చండకర్ముడు అనే గొప్ప భూతం ఉండేది. ఒకసారి అది అరణ్యంలో తిరుగుతూ, చెట్లకిందుగా నడిచిపోతున్న ఒక బ్రాహ్మణుణ్ణి చూసి, అతని భుజాలమీద ఎక్కి, "నడు!" అన్నది.

బ్రాహ్మణుడు బెదిరిపోయి, నడవసాగాడు. భూతం కాళ్లు చాలా నాజూకుగా, పద్మాలంత సుకుమారంగా ఉండటం గమనించి ఆ బ్రాహ్మణుడు, "నీ పాదాలు ఇంత అందంగా ఉండటానికి కారణం ఏమిటి?" అని అడిగాడు.

"నేనొక నియమం పాటిస్తాను. అదేమిటంటే, ఎట్టి పరిస్థితుల్లోనూ తడికాళ్లతో నేలమీద నడవను. ఆ కారణంగా నా పాదాలు అంత సుకుమారంగా ఉంటాయి," అన్నది భూతం.

ఈ మాట విన్న మీదట ఆ భూతాన్ని వదిలించుకునే మార్గం బ్రాహ్మణుడికి తట్టింది.

కొద్దిసేపట్లో వాళ్ళు ఒక కొలను వద్దకు వచ్చారు.

"నేను ఈ కొలనులో స్నానం చేసి, దేవుణ్ణి ఆరాధించి వస్తాను. అంతదాకా నువు ఇక్కడే ఉండు, కదలకు!" అని భూతం కొలనులో దిగింది.

అప్పుడు బ్రాహ్మణుడు, "ఈ భూతం స్నానంచేసి, పూజచేసి వచ్చి నన్ను నిశ్చయంగా పారణ చేసేస్తుంది. పారిపోవటానికి ఇదే మంచి సమయం. అది నన్ను వెంటాడలేదు," అనుకుని, కాలిసత్తువకొద్దీ పరిగెత్తాడు. తడి కాళ్లతో భూతం నేలమీద నడవదు గదా!






## 20

[మంత్రదండం తీసుకుపోయిన బైరాగిశిష్యులు, దాని ప్రభావం తెలుసుకునేందుకు నేల మీద కొట్టగా, అక్కడ సొరంగం ఏర్పడింది. లోపల ఏవో నిధులుండగలవన్న ఆశతో గురుబైరాగి, వాళ్ళూ అందులో దిగారు. ఆ సమయంలో చెరువు దగ్గిరకు వచ్చిన తలారి భల్లూకుడు, ఒక బోయవాణ్ణి చూసి, కోపంగా వాడి మీదికి బయలుదేరాడు. తరవాత— ]

తలారి భల్లూకుడి భయంకరాకారాన్నీ, అతడి చేతిలో తళతళ మెరుస్తున్న గండ్రగొడ్డలినీ చూసి, బోయవాడు పారి పోయే ప్రయత్నం ప్రమాదకరమని గ్రహించి, నిలువెల్లా వణికిపోతూ, చేతులు జోడించి, "అయ్యా, గత వారంరోజులుగా నేను అరణ్యంలో వింతమనుషుల్నీ, భయంకరుడైన ఒక రాక్షసుణ్ణీ కూడా చూశాను. కాని, వాళ్ళెవరితోనూ నేను మాట్టాడిందిలేదు. నేను మీరనే మాయామర్కటుణ్ణి చూడలేదు. నడికొప్పుతలతో, ఎర్రబట్టలు కట్టినవాడొకడు, శంఖం ఊదుతూ, 'శిష్యా, మాయామర్కటా!' అంటూ పిలవటం మాత్రం విన్నాను," అన్నాడు.

బోయవాడు యిలా చెప్పగానే, తలారి భల్లూకుడు ఎక్కడలేని ఆశ్చర్యంతో గజిబిజిపడిపోతూ, గండ్రగొడ్డలి దించి, "ఒరే,



''అదే నాకు అంతుచిక్కటం లేదు. మన భల్లూక మాంత్రికుడికి పోటీగా మరొక మాంత్రికు డెవడైనా బయలు దేరాడేమో. సరే, బోయా! నువ్వనే దొంగ బైరాగులూ, భూసారంగం సంగ తేమిటి?'' అని అడిగాడు తలారి భల్లూకుడు.

బోయవాడు అతణ్ణి, గురుబైరాగీ, వాడి శిష్యులూ దిగిపోయిన సారంగం దగ్గిరకు తీసుకుపోయి, మంత్రదండంతో వాళ్ళు చేసిన అద్భుతాలనుగురించి చెప్పాడు.

ఆ మంత్రదండం భల్లూకమాంత్రికుడి నుంచి, మాయామర్కటుడు దొంగి లించుకుపోయినదే అని తలారి భల్లూ కుడికి అర్థమైపోయింది. ఇప్పుడా మంత్ర దండం మరెవరో బైరాగుల చేతబడిం దన్నమాట!

తలారి భల్లూకుడు యీ సంగతి కాళీ వర్మ, భల్లూకమాంత్రికులకు చెప్పేం దుకు బయలుదేరనున్నంతలో, కాళీవర్మ గుర్రం మీద అక్కడికి వచ్చి, ''భల్లూకా, యీ ప్రాంతం మనం గుడారాలు నిర్మించేందుకు అనుకూలంగా వున్నట్టు న్నదే!'' అన్నాడు.

తలారి భల్లూకుడు, కాళీవర్మను సమీ పించి, ''కాళీవర్మ దొరా గుడారాల

బోయా! నువ్వేదో చాలా ముఖ్యమైన సంగ తులు చెపుతున్నట్టు నాకు అనుమానం కలుగుతున్నది. వాటివెనక వున్న రహస్యం ఏమిటో నా యజమాని కాళీవర్మ ప్రభు వుకే తెలియాలి. పారిపోకు, నీ కొచ్చిన ప్రాణభయం ఏమీలేదు.'' అన్నాడు.

అటవికుడు కూడా ఆశ్చర్యపోతూ, ''తలారి భల్లూకయ్యా, ఈ బోయవాడు చెప్పేవి నమ్మదగినమాటలేనా? ఒక మాంత్రికుడూ, రాక్షసుడు ఉగ్రదండుడూ మన వెంటనేవున్నారు. అలాంటప్పుడు మరొక మాంత్రికుడూ, రాక్షసుడూ అరణ్యంలో తిరుగుతూండటం ఏమిటి?'' అన్నాడు.

మాట తరవాత. ముందు యీ బోయ వాణ్ణి అడిగి చూడండి. వీడు రెండు ఆశ్చర్యం కలిగించే విషయాలు చెబుతు న్నాడు.'' అన్నాడు.

కాళీవర్మ ప్రశ్నించగా, బోయవాడు మరొకసారి తాను అరణ్యంలో చూసిన శంఖం ఊదేవాణ్ణీ, రాక్షసుణ్ణి గురించీ; బైరాగులూ, అతడి శిష్యులిద్దరూ మంత్ర దండం మహిమతో భూమికి సొరంగం కొట్టి, అందులో దిగిపోయిన సంగతీ చెప్పాడు.

ఆ వెంటనే కాళీవర్మ, భూసొరంగం ముఖద్వారం దగ్గిరకుపోయి, ఒకసారి లోపలికి తొంగి చూసి, జాగ్రత్తగా లోపలికి దిగాడు. అతడు అక్కడ వున్న మెట్లు దాటగానే, దూరంగా ఎక్కడో కనిపిస్తున్న చిన్న వెలుగూ, దానికేసి నడుస్తున్న మూడు నల్లని ఆకారాలూ అతడి కంటబడినై.

కాళీవర్మ చప్పున సొరంగమార్గం పైకి వచ్చి, తలారి భల్లూకుడితో, ''తలారి భల్లూకా! నీ ఆటవికసేవకుణ్ణి యిక్కడ కాపలా వుంచి, నువ్వు వెంటనే బయలు దేరిపోయి, మాంత్రిక గురువుకు యిక్కడ విన్నదీ, చూసినదీ—అంతా చెప్పు. నేను యీలోపల సొరంగమార్గాన పోయి, పారిపోతున్న బైరాగుల దగ్గిర వున్న మంత్ర



దండాన్ని తిరిగి సంపాయిస్తాను.'' అన్నాడు.

తలారి భల్లూకుడు బయలుదేరి నాలు గైదడుగులువేసి ఆగి, ''కాళీవర్మ ప్రభో! ఇప్పుడా బైరాగుల దగ్గిర వున్నది, భల్లూక మాంత్రికుడి మహిమ గల మంత్రదండం. ఆ సంగతి మరవకండి.'' అన్నాడు.

కాళీవర్మ కత్తి దూసి, సొరంగం కేసి తిరిగి, ''భల్లూకా, నా దగ్గిర వున్న యీ బంగారు పిడి గల కత్తి మహత్తు మాటేమోగాని, శక్తిలో ఏ మంత్రదండానికీ తీసిపోదు. నా తండ్రి చేతిలో వుండగా యిది, యిప్పటి రాజు జితకేతుడి తండ్రి గారి శత్రువులనెందరినో హతమార్చింది.



కాలం సింహాసనం మీద వుండదని, నా నమ్మకం. అప్పుడు గెలిచినవాళ్ళ పక్షాన వున్న మనకు, రాజాస్థానంలో మంచి నౌకరీలు దొరికే అవకాశం వున్నది.'' అన్నాడు.

బోయవాడు ఆశగా ఆటవికుడి కేసి చూస్తూ, ''ఆటవికన్నయ్యా, నువ్వేదో చాలా చెప్పావు. బాగానే వున్నది. దుర్మార్గుడూ, చేతగానివాడూ అయిన ఈ జితకేతరాజును సింహాసనం మీది నుంచి దింపగలిగిన బలవంతుడెవరు ?'' అని అడిగాడు.

ఆటవికుడు అప్పుడే సొరంగమార్గం లోకి దిగిపోతున్న కాళీవర్మను చూపిస్తూ, ''ఆయన పేరు కాళీవర్మ. లోగడ రాజు జితకేతుడు ఆయన్ను అవమానించటమే గాక, దిరిసెనవనంలో తల నరికించేందు కూడా ప్రయత్నించాడు. ఇప్పుడాయన, ఆ రాజు మీద పగ దీర్చుకోబోతున్నాడు.'' అన్నాడు.

బహుశా, ఈ కత్తి త్వరలోనే యీ జితకేత రాజు తల నరకవచ్చు.'' అన్నాడు.

మర్రిచెట్టు మీది నుంచి కిందికి దూకిన బోయవాడు దిక్కులు చూస్తూ, "అయ్యా యిక నా దారిన నేను పోవచ్చా?'' అని అడిగాడు.

తలారి భల్లూకుడి సేవకుడైన ఆటవికుడు వాణ్ణి సమీపించి, ''ఒరే, నువ్వు బోయవాడివి, నేను ఆటవికుణ్ణి. బతుకు తెరువుకు మనిద్దరం చెట్టూపుట్టా పట్టుకు తిరగవలసినవాళ్ళమే. అందువల్ల నువ్వూ, నాలాగే ఏ శక్తిమంతుణ్ణో ఆశ్రయించి, ఎందుకు బతగ్గూడదు ? ఈ చంద్రశిలా నగరం రాజు జితకేతుడు యింకా ఆట్టే

బోయవాడు, ''అన్నా, నేనూ, నీతో పాటే!'' అంటూ ఎగిరి గంతేసి ఆటవికుణ్ణి కావిలించుకున్నాడు.

సొరంగమార్గం ప్రవేశించిన కాళీవర్మ, మోకాటి నీటిలో కొంతదూరం నడిచి, ముందుపోతున్న బైరాగులను హెచ్చరిస్తూ, ''ఒరే, ఆగండి !'' అంటూ కేక పెట్టాడు.

ఆ కేక వింటూనే బైరాగులు వెనక్కు తిరిగి చూశారు. బైరాగి చిన్న శిష్యుడు గడగడలాడిపోతూ, "బైరాగి గురో! నిధులను కాపాడే యక్షుడు మన ప్రాణాలు తీయటానికి వస్తున్నాడు." అన్నాడు.

గురుబైరాగి కూడా ఒక క్షణంపాటు భయభ్రాంతుడైపోయి, కాళీవర్మ కేసి పరీక్షగా చూసి, "ఒరే, శిష్యోపశిష్యుల్లారా, మనం మరీ అంతగా భయపడవలసిన పని లేదు. ఈ వస్తున్నవాడు యక్షుడిలా లేడు. యక్షులు పొట్టిగా వుంటారనీ, కంఠస్వరం చాలా పీలగా వుంటుందనీ, మా గురువు చెప్పగా విన్నాను. వీడు ఆజానుబాహుడు; కంఠస్వరం కంచు గంటలా మోగింది. మామూలు మనిషే. మన మంత్రదండంతో పరలోకయాత్ర కట్టిద్దాం." అన్నాడు.

గురుబైరాగి మాట పూర్తి చేసేంతలో కాళీవర్మ వేగంగా వాళ్ళను సమీపిస్తూ, "ఒరే, మీ సంగతంతా, నాకు తెలుసు. ఈ కత్తి, మీరు దొంగిలించిన మంత్ర దండం కన్న శక్తిగలది! పరీక్షించి చూస్తారా?" అంటూ కత్తి ఝుళిపించాడు.

కత్తి తళతళలు చూస్తూనే బైరాగి శిష్యులిద్దరూ హడలెత్తిపోయి, "గురో! త్వరగా మంత్రం జపించి, వాణ్ణి భస్మం చెయ్యండి!" అన్నారు.



గురుబైరాగి ఒకపక్కన భయం కొద్దీ వడవడ వణికిపోతూనే, మంత్రదండం ఎత్తి; ఏదో మంత్రం జపించాడు. అందు వల్ల ఏ ప్రయోజనం కలగకపోగా, కాళీవర్మ అతణ్ణి సమీపించి, కత్తిని గుండెల కానిస్తూ, "ఒరే, బైరాగీ! ఆ మంత్ర దండం, దాని యజమానినైన, నా ఒక్కడి మాటే వింటుంది. దాన్ని యిస్తావా, గుండెల్లో కత్తి దించమంటావా?" అన్నాడు భీకరంగా.

గురుబైరాగి యివ్వటమా, మానటమా అని తటపటా యిస్తున్నంతలో, శిష్యులిద్దరూ ఏక కంఠంగా, "బైరాగి గురో, ఆ మంత్రదండం యిచ్చెయ్యండి. దానికే



మాత్రం మహత్తున్నా మనను కాపాడేది. ఈ చలికాలంలో, చలిమంటలో వేయటానికి తప్ప, అది మరెందుకూ కొరగాదు." అన్నారు.

"లెస్స పలికార్రా, శిష్యోపశిష్యుల్లారా!" అంటూ గురు బైరాగి లేని గాంభీర్యం తెచ్చిపెట్టుకుని, కాళీవర్మకు మంత్రదండాన్ని యిస్తూ, ''వీరయువకుడా! నీ సాహస ప్రతాపాలకు మెచ్చాను. ఈ మంత్రదండాన్ని ఎత్తుకుపోయి, జితకేతరాజు దత్తాడబోతున్న పిల్లను పెళ్లాడి, నూరేళ్ళపాటు హాయిగా చంద్రశిలా నగరాన్ని పాలించు. నా వాక్కుకు తిరుగులేదు.'' అన్నాడు.

ఆ మాటలకు నవ్వుతూ, కాళీవర్మ మంత్రదండాన్ని తీసుకుని, ముందుకు వెళ్ళటమా లేక వెనక్కు తిరిగిపోవటమా అని ఆలోచిస్తున్నంతలో, గురు బైరాగి రహస్యం చెపుతున్నవాడిలా, ''వీరయువకుడా! ఆ నిధుల్లో కాస్తంతభాగం మాకూ యివ్వటం ధర్మంగదా?'' అన్నాడు.

గురుబైరాగి యిలా అన్న తరవాత కాళీవర్మకు మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. అతడు బైరాగులకేసి ఓ మారు పరీక్షగా చూసి, ''పాపం, మీరు యీ సొరంగంలో ఏవో నిధులున్నవని ఆశపడి, యిక్కడికి వచ్చినట్టున్నది. కాని, నా ఉద్దేశం యీ సొరంగం రాజుగారి కోటలో నుంచి, అవసరం కలిగినప్పుడు శత్రువులకు దొరకకుండా పారిపోయేందుకు, యిప్పటి రాజవంశంవాళ్లు తవ్వించినదిలా కనబడుతున్నది. కాని, యిక్కడేమైనా వెండి, బంగారాల్లాంటివి దొరికితే, వాటిని తీసుకుపోయేందుకు, మీకు అనుమతి యిస్తాను. నాతోపాటు సొరంగమార్గం వెంట ముందుకు రాగలరా?'' అని అడిగాడు.

గురుబైరాగి, శిష్యులతోపాటు అమితానందపడిపోతూ, ''వీరయువకుడా! నీ మాట కాదనగలమా? ముందుండి దారి తియ్యి.'' అన్నాడు.

అందరూ కలిసి దూరంగా సన్నని వెలుగుపడుతున్న ప్రదేశాని కేసి నిశ్శబ్దంగా నడిచారు. ఒకచోట సొరంగ మార్గం అంతమైపోయి, పైనున్న రాతి పలక సందుల నుంచి, చిన్న వెలుగు కిందికి ప్రసరిస్తున్నది.

కాళీవర్మ, బైరాగులతో, ''మనం పైనున్న రాతిపలకను నిశ్శబ్దంగా పక్కకు నెట్టగలిగితే, ఆ తరవాత, రాజుగారి కోట లోని ఏ భాగంలో మనం వున్నామో తెలుసుకోవచ్చు. ఊఁ, ఒక పట్టు పట్టండి!'' అన్నాడు.

అందరూ కలిసి రాతిపలకను పక్కకు నెట్టారు. వెంటనే సొరంగమార్గం సూర్య కాంతితో మిలమిల్లాడింది. పైన రాతి పలకను కప్పివున్న కొన్ని పూలమొక్కలు చిన్న శబ్దంతో పక్కకు పడిపోయినై.

ముందుగా కాళీవర్మ పైకి వచ్చి, చుట్టూ ఓమారు కలయచూసి, తాము రాజుగారి ఉద్యానవనంలో ప్రవేశించినట్టు గ్రహించాడు. తరవాత అతడు సైగ చేయగానే బైరాగులందరూ సొరంగం నుంచి పైకి వస్తూనే, ''ఆహాఁ, ఏమీ ఉద్యానవన సౌందర్యం! జితకేత మహా రాజుగారిది లాగున్నదే!'' అన్నారు.

కాళీవర్మ వాళ్ళను మెల్లిగా మాట్టాడ మని హెచ్చరించి, ''మనం చాలా



ప్రమాదకరమైన ప్రదేశానికి వచ్చాం. నాకు ప్రాణం మీద అంతగా తీపిలేదు. రాజభటులెవరైనా చూసి చుట్టుముట్టితే, ప్రాణాలుండగా వాళ్ళకు లొంగను. మీ సంగతేమిటి?'' అన్నాడు.

బైరాగి గురువు గజగజలాడిపోతూ, ''మాకు ప్రాణాలంటే మహా తీపి గనకే గదా, చావలేక యిలా ఏవో గాలి బతుకులు బతుకుతున్నాం! సొరంగంలో నిధి నిక్షేపాలు లేవని తెలిసిపోయింది. తమ అనుమతి అయితే, యిక మా దారిన మేం పోతాం.'' అన్నాడు.

కాళీవర్మ, బైరాగులను అలాగే వెళ్ళ మని చెప్పబోయేంతలో, సొరంగమార్గం

వైపున వున్న చెట్ల వెనక నుంచి రాజు జితకేతుడూ, మాయామర్కటుడూ ఏదో మాట్లాడుకుంటూ రావడం కనిపించింది. కాళీవర్మ చప్పున అక్కడ వున్న పూల పొదల చాటుకు పోతూ, బైరాగులతో, ''మీ కొచ్చిన ప్రాణభయం ఏమీలేదు. మీరు రాజూ, మాయామర్కటుడి కంట బడటం జరిగితే, పోయిన మంత్రదండం నగరంలోని ఏ సుబ్బిశెట్టి చేతిలోనో చూశామనీ, ఆ సంగతి చెప్పేందుకు వచ్చామనీ అబద్ధం ఆడేయండి. ఆ తరవాత ఏం జరుగుతుందో చూద్దాం,'' అన్నాడు.

కాళీవర్మ యిలా మాట్లాడుతున్న సమయంలోనే, ఎక్కడో దూరాన్నుంచి శంఖనాదం వినిపించింది. ఆ మరుక్షణం మాయామర్కటుడు అందుబాటులో వున్న చెట్టు కొమ్మమీదికి కీచుమంటూ ఎగురుతూ, ''జై, తాంత్రికగురో! తమరు శంఖాన్ని పూరిస్తున్నది కోటలోపలినుంచా, వెలపలి నుంచా?'' అంటూ కేక పెట్టాడు.

శంఖనాదం ఆగిపోయింది. మాయామర్కటుడు కొమ్మమీది నుంచి కిందికి గెంతబోతున్న తరుణంలో, వాడికి భయంతో దిక్కులు చూస్తున్న బైరాగులు ముగ్గురూ కనిపించారు.

మాయామర్కటుడు పెద్దగా కీచుమంటూ అరిచి, ''జితకేతు రాజా! ఇది తమ ఉద్యానవనమా లేక బైరాగుల మఠమా? వెంటనే ఆ పూల పొదల దగ్గిర వున్న బైరాగుల్ని పట్టి బంధించండి!'' అంటూ కిందికి దూకాడు.

రాజు జితకేతుడు గట్టిగా చప్పట్లు చరిచి, రాజభటులను పిలుస్తూ బైరాగులను సమీపించి, ''ఎవర్రా మీరు? ఎవరి అనుమతితో నా ఉద్యానం ప్రవేశించారు?'' అన్నాడు కోపంగా.

గురుబైరాగి రెండు చేతులూ పైకెత్తి, ''మహారాజా, మంత్రదండం!....సుబ్బిశెట్టి!....మంత్రదండం!....సుబ్బిశెట్టి!'' అంటూ అదే మాటగా కేకలు పెట్టసాగాడు. —(ఇంకా వుంది)






# పితృవాక్యపాలన

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఉన్నతమైన ఆదర్శం కోసమే నువు ఇలా శ్రమపడుతూ ఉండవచ్చు. కాని ఆదర్శాలను నిలబెట్టుకునే దక్షత కూడా ఉండాలి. లేనిపక్షంలో పితృవాక్యపాలన చేయలేకపోయిన శేఖరుడి లాగే నాశనమైపోతావు. శ్రమతెలియకుండా ఉండగలందులకు నీకు అతని కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

శేఖరుడు అనేవాడు విదేహరాజ్యంలో ఒక ఉన్నతోద్యోగి కొడుకు. అతని తండ్రి పేరు వైశాఖుడు. వైశాఖుడికి లాగే విదేహ రాజుకు కూడా ఒక్కడే కొడుకు. అతని పేరు విజయుడు. విజయుడూ, శేఖరుడూ

బేతాళ కథలు



ఆబాల్యస్నేహితులు; ఒకే గురువు వద్ద విద్యలు నేర్చి, ఒకే తండ్రి పిల్లల లాగా పెరిగారు. విజయుడు రాజు కాబోయేవాడై నప్పటికీ, శేఖరుణ్ణి తనతో సమంగా చూసుకునేవాడు.

శేఖరుడి తండ్రి వైశాఖుడు మరణ శయ్యమీద ఉండి, తన కొడుకును రహస్యంగా పిలిచి, "నాయనా, నువు నీ తండ్రి ఋణం తీర్చుకోవాలంటే నాది ఒక్క కోరిక తీర్చాలి. తీర్చుతానని మాట ఇయ్యగలవా?" అని అడిగాడు.

"తప్పక తీర్చుతాను. పితృవాక్య పరిపాలన చెయ్యనివాడు కొడుకే కాదు. మీ కోరిక చెప్పండి," అన్నాడు శేఖరుడు.

"విదేహరాజవంశాన్ని నిర్మూలించు," అన్నాడు వైశాఖుడు.

శేఖరుడు ఈ మాట విని నిర్ఘాంత పోయాడు. తన తండ్రి అలాటి కోరిక కలిగి ఉండటం స్వామిద్రోహమూ, రాజద్రోహమూనూ! తన చేతి మీదుగా తాను తన మిత్రుణ్ణి, విజయుణ్ణి, చంపటం మిత్రద్రోహం!

"అదేమిటి, నాన్నా? అలాటి కోరికకు కారణం ఏదో ఉండాలిగద!" అన్నాడు శేఖరుడు.

"విదేహ రాజు నాకు యజమాని అయితే కావచ్చుగాని నన్ను నిండు కొలువులో ఒకసారి అవమానించాడు. అవకాశం దొరికినప్పుడల్లా నా పైన కఠిన చర్యలు తీసుకున్నాడు. ఈ రాజవంశం అంతమైతేనేగాని నా ఆత్మకు శాంతి ఉండదు. మాటతప్పని వాడివైతే, నా ఆఖరు కోరిక తీర్చు. తీర్చుతానని నువు ప్రమాణం చేస్తేనేగాని, నేను నిశ్చింతగా చావను," అన్నాడు వైశాఖుడు.

తండ్రి చివరి కోరిక తీర్చుతానని శేఖరుడు ప్రమాణం చేశాడు.

వైశాఖుడు తృప్తిగా చిరునవ్వు నవ్వి, ప్రాణాలు వదిలాడు.

తండ్రి పోగానే శేఖరుడికి రాజు కొలువులో తండ్రి ఉద్యోగం దొరికింది.

అదేసమయంలో విదేహరాజు తన కొడుకైన విజయుడికి రాజ్యభారం అప్పగించాడు. ఇప్పుడు శేఖరుడు తన కింద నౌకరు అయినప్పటికీ, విజయుడు అతన్ని మిత్రుడుగానే చూస్తూ, వేటకు వెళ్ళినా, వాహ్యాళికి వెళ్ళినా శేఖరుణ్ణి తన వెంట తీసుకుపోతూనే ఉన్నాడు. దివాణం దాటితే వాళ్ళు యజమానీ, నౌకరూ లాగా కాక, ఆప్తమిత్రులల్లేనే ఉంటున్నారు.

ఈ విషయంలో విజయుడు మారక పోయినా, శేఖరుడు క్రమంగా మారాడు. తండ్రికి ఇచ్చినమాట నిలబెట్టుకోవటానికి తాను రాజవంశాన్ని నిర్మూలించాలి. అందుకు విజయుణ్ణి చంపితే చాలు. రాజుకు వేరే సంతానం లేదు, కలిగే అవకాశం కూడా లేదు. అందుచేత, విజయుణ్ణి చంపటానికి శేఖరుడు తన మనసును సిద్ధపరచుకుంటూవచ్చాడు.

ఒకసారి విజయుడు వేటకు బయలు దేరుతూ, శేఖరుణ్ణి తన కూడా తీసుకు వెళ్ళాడు. అడవిలో ఒక సమయంలో స్నేహితులిద్దరూ భటులకు దూర మయారు. శేఖరుడు కత్తితో విజయుణ్ణి వెన్నులో పొడవబోతూండగా భటులు అటుగా వచ్చారు. శేఖరుడి ప్రయత్నం కొనసాగలేదు.

మరోసారి స్నేహితులిద్దరూ నగరం వెలపల కొండ మీదికి వాహ్యాళి వెళ్ళారు. అది చాలా అందమైన ప్రదేశం. కొండ





అవతల ఒక చక్కని లోయ ఉన్నది. లోయవైపు కొండ నిటారుగా ఉండటం చేత లోయలోకి దిగటానికి లేదుగాని, కొండ అంచున నిలబడి లోయ అంతా కలయచూసి, ఆనందించవచ్చు. స్నేహితులిద్దరూ ఆ కొండ అంచున చాలాసార్లు నిలబడి లోయను చూసి ఆనందించారు.

ఈసారి విజయుణ్ణి శేఖరుడు ఆ కొండ అంచుకు తీసుకుపోయాడు. అక్కడి నుంచి విజయుణ్ణి లోయలోకి తోసేస్తే, శవం కూడా గుర్తుపట్టటానికి ఉండదు. లోయను చూడటంలో విజయుడు నిమగ్నుడై ఉన్నాడనుకుని, శేఖరుడు అతన్ని లోయలోకి తోయబోయాడు.

విజయుడు వెనక్కు చూసి, ''ఇది చాలా ప్రమాదమైన చోటు! కిందికి పోదాం పద!'' అన్నాడు శేఖరుడితో.

కిందికి దిగిన స్నేహితులు ఒక రాతి బండ మీద కూర్చున్నారు. విజయుడు శేఖరుడితో, ''నాకు నిన్న రాత్రి చెడ్డకల వచ్చింది.'' అన్నాడు.

"ఏమిటా చెడ్డకల?" అని శేఖరుడు అడిగాడు.

''నువు నన్ను కత్తితో పొడిచావట. నేను ప్రాణంవిడుస్తూ, నీ పేరే ఉచ్చరిస్తూ, నీ కళ్ళలోకి చూశానట! మనవంటి గాఢస్నేహితుల మధ్య ఇలాటి సంఘటన ఊహించటానికే వీలులేదు గదా!'' అన్నాడు విజయుడు.

శేఖరుడికి నోట మాట రాలేదు. అతని ముఖం రక్తహీనం కావటం గమనించి, ''నువు నన్ను కొంతకాలంగా చంపటానికి చూస్తున్నావు. నా వల్ల నీ కేం ద్రోహం జరిగింది? దాపరికం లేకుండా చెప్పు.'' అన్నాడు విజయుడు.

గత్యంతరంలేక శేఖరుడు తాను తన తండ్రికి ఆఖరుక్షణంలో ఇచ్చిన మాట గురించి విజయుడికి చెప్పాడు.

అంతా విని విజయుడు, ''నువు శ్రీరాముడి లాగా పితృవాక్యపాలన చేయ నిర్ణయించుకోవటం మెచ్చదగినదే! నన్ను

నీ కత్తితో సంహరించి, నీ తండ్రి ఋణం తీర్చుకో!'' అన్నాడు.

అన్నాడే చాలునన్నట్టు శేఖరుడు కత్తి దూశాడు. కాని అదేక్షణంలో విజయుడు కూడా తన కత్తి దూసి, అతన్ని ఎదుర్కొన్నాడు. శేఖరుడు విస్తుపోయాడు.

విజయుడు మందహాసం చేసి, ''మరేం లేదు, శేఖరా! నువు నన్ను ఇలా చంపేస్తే నీకు హత్య చేసిన పాపమూ, నాకు నరకమూ కలుగుతాయి. ఇద్దరం వీరోచితంగా పోరాడి చచ్చిపోతే, వీర స్వర్గం లభిస్తుంది,'' అన్నాడు.

ఇద్దరూ కత్తియుద్ధం చేశారు. విజయుడి ధాటికి శేఖరుడు తట్టుకోలేకపోయాడు. అతని చేతి కత్తి ఎగిరిపోయింది. అతన్ని ఒక్క తోపుతో కిందపడేసి విజయుడు, ''పితృవాక్యపాలన చేయలేకపోయావు గాని, వీరస్వర్గం అలంకరించు,'' అంటూ ఒక్క వేటుతో శేఖరుడి తల నరికేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, విజయుడు తన ఆప్తమిత్రుణ్ణి చంపటం అన్యాయం కాదా? శేఖరుడు మామూలు హంతకుడు కాడు. అతను ఒక ఆదర్శం కొరకు విజయుణ్ణి చంపాలనుకున్నాడు. అలాటివాణ్ణి కారాగృహంలో పెట్టవచ్చు, దేశం నుంచి వెళ్ళగొట్టవచ్చు. విజయుడు అతన్ని ఎందుకు చంపాడు? శేఖరుడు తనను చంపబోయాడన్న కసితోనా? లేక అతని పట్ల తనకు నిజమైన స్నేహభావం లేకనా? ఈ సందేహానికి సమాధానం



తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల బద్దలవుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''పితృవాక్య పాలన కోసమైనా శేఖరుడు తలపెట్టినది విజయుడి హత్య. కాని విజయుడు ద్వంద్వ యుద్ధంలో శేఖరుడు తనను చంపే అవకాశం ఇచ్చాడు. విజయుణ్ణి యుద్ధంలో చంపే శక్తి శేఖరుడికి లేకపోయింది. పితృవాక్యపరిపాలన అన్నది ఒక్కటే మనిషికి మహత్తరమైన ఆశయం కాదు. కృతజ్ఞతా, రాజభక్తి, స్నేహ ధర్మమూ లాటి అనేక గొప్ప ఆశయాలు మనిషికి ఉన్నాయి. మనిషికి గల ఆశయాల మధ్య సంఘర్షణ వచ్చినప్పుడు హీనమైన ఆశయాన్ని విడిచిపెట్టి, ఉన్నతమైన ఆశయాన్ని మనిషి చేపట్టాలి. శేఖరుడి విషయంలో పితృవాక్యపాలన చాలా హీనమైన, క్షుద్రమైన ఆశయం. శేఖరుడి తండ్రి క్షుద్రుడు. రాజు ఉదారుడు గనకనే అతను ఎన్నో తప్పులు చేసినా కొలువులో నుంచి తొలగించలేదు. అయినా రాజు అతన్ని నిండు సభలో అవమానించాడంటేనూ, అనేకసార్లు కఠిన చర్యలు తీసుకున్నాడంటేనూ, శేఖరుడి తండ్రి తన పని నిర్వర్తించటంలో అసమర్థుడై ఉండాలి. శేఖరుడు కూడా క్షుద్రుడి లాగే ప్రవర్తించాడనాలి. తన తండ్రి తన తుదికోరికకు కారణాలు చెప్పినప్పుడు, తండ్రి కోరిక నెరవేర్చనవసరం లేదని నిర్ణయించుకుని, ఆ మాట తండ్రికి చెప్పి ఉండవచ్చు. అతను అలా చెయ్యలేదు. విజయుడు తన కల చెప్పినప్పుడు శేఖరుడు తన తప్పు తెలుసుకుని విజయుడి కాళ్ళ మీద పడి ఉండవచ్చు. అలాగూ చేయలేదు! విజయుడు తనను చంపమన్నప్పుడు శేఖరుడు కత్తిదూయటం కన్న పరమనీచమైనపని ఇంకొకటి ఉండదు. అలాటివాడి మరణం గురించి విచారించనవసరంలేదు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# కొత్తదయ్యం-పాతదయ్యం

ఒక ఊళ్లో ఒక రైతు ఉండేవాడు. పొలం పనులకూ, బండిలాగటానికీ అతని వద్ద రెండు ఎద్లు ఉండేవి. వాటిలో ఒకటి చనిపోయింది. దానికి బదులుగా మరొక ఎద్దును కొనుక్కురావటానికి రైతు, తన కొడుకును వెంటబెట్టుకుని ప్రయాణమయాడు. దారిలో తినటానికి రైతు భార్య వాళ్ళ కోసం మూడు సజ్జరొట్టెలు కాల్చి, మూటగట్టి ఇచ్చింది.

తండ్రి కొడుకులు సంతకు వెళ్ళి వెతకగా, వెతకగా ఒక ఎద్దు దొరికింది. బేరం కుదుర్చుకుని ఆ ఎద్దును కొని తిరిగి వస్తూ, దారిలో ఒక దిగుడు బావి కనబడితే అక్కడ రొట్టెలు తినటానికి తండ్రి కొడుకులు మెట్లు దిగి, కాళ్లూ, చేతులూ కడుక్కున్నారు.

రైతు కొడుకు మూట విప్పి, మూడు రొట్టెలుండటం చూసి. "నాన్నా, నాకు ఆకలిగాలేదు. నీకు రెండూ, నాకు ఒకటీ!" అన్నాడు.

ఆ దిగుడు బావిలో మూడు దయ్యాలు కాపరం ఉంటున్నాయి. రైతు కొడుకు అన్న మాటకు అవి హడలిపోయి, పైకి వచ్చి, "బాబ్బాబు, మమ్మల్ని తినకండి. మీరు ఏం పనిచెబితే అది చేస్తాం!" అన్నాయి తండ్రి, కొడుకులతో.

రైతు అవి దయ్యాలనీ, తమను చూసి భయపడ్డాయనీ గ్రహించి, "మా వెంట వచ్చి, మేం చెప్పిన పనులన్నీ చేస్తే, మిమ్మల్ని తినం," అన్నాడు.

"మీరు ఏం చెయ్యమంటే అది చేస్తాం," అన్నాయి దయ్యాలు విధేయతగా.

రైతూ, అతని కొడుకూ కొత్త ఎద్దుతో బాటు దయ్యాలను కూడా ఇంటికి తెచ్చి, వాటిచేత అడ్డమైన చాకిరీ చేయించుకోసాగారు.

ఎ. సరోజనమ్మ

దయ్యాల సంగతి ఇలా ఉండగా, వాటిని అప్పుడప్పుడూ చూడవచ్చే దయ్యాలు, బావిలో అవి లేకపోవటం గమనించి, విచారించగా, ఎవరో ఇద్దరు మనుషులు వచ్చి వాటిని వెంటబెట్టుకుపోయినట్టు తెలిసింది.

ఆ పాతదయ్యాలను వెతుక్కుంటూ ఒక కొత్తదయ్యం రైతు ఇంటికి వచ్చి, వాటిని ఒక పశువుల కొట్టంలో చూసి, ''మీరు మీ బావిని వదిలిపెట్టి ఇక్కడ ఎందుకు ఉన్నారు?'' అని అడిగింది.

''మా కష్టాలు ఏమని చెప్పం? ఇద్దరు మనుషులు మేము ఉండే బావిలో దిగి, మమ్మల్ని తింటామని భయపెట్టి, మా చేత చాకరీ చేయించుకుంటున్నారు!'' అని పాతదయ్యాలు లబలబలాడాయి.

''అదెంతపని? నేను ఆ మనుషులను అమాంతం చంపేస్తాను. నన్ను ఈ మూల దాక్కోనియ్యండి,'' అన్నది కొత్తదయ్యం.

ఇంతలో రైతూ, కొడుకూ పశువుల కొట్టంలోకి వచ్చారు. తండ్రి కొత్త ఎద్దును చూసి, కొడుకుతో, ''ఒరే, ఈ కొత్తదానికి వాతం చేసింది. వాతపెట్టటానికి గరిట కాల్చి ఉంచాను. దాన్ని పట్టుకురా!'' అన్నాడు.

దాక్కుని ఉన్న దయ్యం హడలిపోయి, పరిగెత్తుకుంటూ వచ్చి రైతు కాళ్ళ మీద పడి, ''బాబోయ్, నాకు వాతలు పెట్టవద్దు. నేను కూడా పాతదయ్యాలు చేసే పనులన్నీ చేస్తాను. వాళ్ళు పొలం నుంచి పత్తి మాత్రమే తెస్తున్నారు. నేను దాన్ని ఏకిపెట్టుతాను,'' అన్నది.

''ఆ మాట నేనే చెబుదామనుకుంటున్నాను. ఇకమీద నాకు పొలం నుంచి తెచ్చే ముడిపత్తి చాలదు. ఏకినదూది కావాలి,'' అన్నాడు రైతు.

తరవాత పాతదయ్యాలు, కొత్తదయ్యాన్ని తిట్టుతూ, ''నీ ప్రయోజకత్వం అడుక్కుతిన్నట్టే ఉన్నది. మమ్మల్ని చెర విడిపిస్తానని ప్రగల్భాలు పలికి, ఉన్న చాకిరికి పత్తి ఏకడం పని ఒకటి కొత్తగా తెచ్చిపెట్టావు!'' అన్నాయి.





# మనుషులమధ్య రాక్షసుడు

వింధ్యాటవుల్లో కామరూపుడు అనే రాక్షసుడు ఉండేవాడు. వాడికి కోరిన రూపం ధరించే శక్తి ఉండేది. వాడికి కొంత కాలానికి జీవితంపై విరక్తిపుట్టి, చచ్చిపోవాలనుకున్నాడు. కాని ఎలా చావాలో వాడికి తెలియలేదు. కొండల మీది నుంచి వాడు ఒక్క అంగలో కిందికి దిగగలడు; అందుచేత కొండల మీది నుంచి దూకి చావలేడు. సముద్రంలో పడి చద్దామంటే, సముద్రం వాడికి మోకాలి లోతు కూడా రాదు. మారురూపంలో చావటానికి యత్నించినా, ప్రమాదపరిస్థితిలో వాడికి అసలు రూపు వచ్చేస్తుంది. అందుచేత వాడికి చచ్చే మార్గం లేకపోయింది.

ఒకసారి వింధ్యాటవులకు ఒక మహా తేజస్వి అయిన ఋషి వచ్చాడు. ఆయన తేజస్సు చూసి ప్రభావితుడై, కామరూపుడు మనుష్యరూపంలో ఆయనను కలుసుకుని, తన కథ అంతా చెప్పుకున్నాడు.

"రాక్షసులకు ఇవి రోజులు కావు. రాక్షసజన్మలో సుఖం లేదు. నువు జీవితం చాలించాలనుకోవడం మంచిదే. కాని నీకు ఇంకా చాలా ఆయుస్సు ఉన్నది. ఇప్పుడు నీవు చనిపోతే, ఆ ఆయుస్సు కోసం మరో జన్మ ఎత్తవలసివస్తుంది. ఏ జన్మ కావాలో కోరుకో. నీకు ఈ జన్మ నుండి విముక్తి కలిగిస్తాను," అన్నాడు ఋషి.

అయితే, కామరూపుడికి ఏ జన్మ కోరుకోవాలో తెలియక, ఋషినే సలహా అడిగాడు.

"అన్ని జన్మలలోకీ ఉత్తమమైనది మానవజన్మ. అదే కోరుకో," అన్నాడు ఋషి కామరూపుడితో.

ఋషి మాటలలో ఎంత నిజం ఉన్నదీ తెలుసుకోవడానికై, మనుషుల మధ్య

కొంతకాలం ఉండి వస్తానని కామరూపుడు బయలుదేరాడు.

వాడు మనిషిరూపంలో ఒక నగరం చేరుకున్నాడు. అక్కడ వాడు ఒక ఇంట మకాంపెట్టి, మనుషులను గమనించ సాగాడు. మనుషులు నీతినియమాలు పాటిస్తూ, ఎంతో హాయిగా జీవిస్తున్నట్టు వాడికి తోచింది.

ఆ నగరానికి వీరసింహుడు అనేవాడు రక్షకుడు. వీరసింహుడు నగరరక్షకుడుగా ఉండగా నగరానికి ఎవరివల్లా, ఎలాటి ప్రమాదమూ ఉండదని నగరవాసులకు గట్టి నమ్మకం. ఆ వీరసింహుడి ప్రతాపం ఎటువంటిదో తెలుసుకోవాలని ఒకసారి కామరూపుడు అతన్ని చూడబోయాడు.

వీరసింహుడు తన శక్తిసామర్థ్యాలను గురించి కామరూపుడి దగ్గిర ఎన్నో ప్రగల్భాలు పలికి, చివరకు, ''విక్రమార్కుడి వంటివారు ఎందరో రాక్షసులను ధైర్యంగా ఎదిరించి, చంపారని చెబుతారు. అవకాశం దొరికితే నేను కూడా అలా చేయగలను!'' అన్నాడు.

కామరూపుడు వెంటనే తన అసలు రూపం ధరించి, ''నా చుట్టూ ముమ్మారు ప్రదక్షిణం చేసి, నా కాళ్ళకు మొక్కితే నిన్ను ప్రాణాలతో వదిలిపెడతాను,'' అన్నాడు.

వీరసింహుడు వణికిపోతూ, రాక్షసుడి చుట్టూ మూడుసార్లు తిరిగి, కాళ్ళ మీద పడ్డాడు.



మనుషుల ప్రతాపం ఏపాటిదో తెలుసుకుని, కామరూపుడు అక్కడినుంచి మాయమయాడు.

ఆ నగరంలోనే ఒక ధనికుడు ఉన్నాడు. ఆయనకు హేమాంగి అని ఒకే ఒక కూతురు. ఆమెకు పెళ్ళీడు వచ్చింది. ఆమెకు పెళ్ళి చేసెయ్యాలని ధనికుడు తొందరపడుతున్నాడు. కామరూపుడు అందమైన యువకుడి రూపంలో ధనికుణ్ణి చూడబోయి, హేమాంగిని పెళ్ళాడతానన్నాడు. ధనికుడు అతన్ని అనేక ప్రశ్నలు వేసి, అభ్యంతరాలు చెప్పాడు.

కామరూపుడు తన అసలు రూపు ధరించి, ''నీ కూతుర్ని నాకిచ్చి పెళ్ళి చేస్తావా, చెయ్యవా?'' అని అడిగాడు.

ధనికుడు నిలువునా వణికిపోతూ, చంపవద్దని వేడుకుని, తన కూతుర్ని ఆ రాక్షసుడికి ఇచ్చి పెళ్ళి చెయ్యటానికి ఒప్పుకున్నాడు.

కామరూపుడు దిక్కులు దద్దరిల్లేటట్టు నవ్వి, అక్కడినుంచి అదృశ్యమయాడు. మనుషులలో ఉండే ప్రేమాభిమానాలు వాడికి తెలిశాయి.

అదే నగరంలో శివానందుడు అనే మహాభక్తుడు ఉన్నాడు. ఆయన ఇంట నిత్యమూ భజనలు జరిగేవి. జనం తండోపతండాలుగా ఆయన ఇంటికి వెళ్ళి వస్తూండేవారు.

ఒకనాటి అర్ధరాత్రివేళ కామరూపుడు శివానందుడి ఇంటికి వెళ్ళి, తన అసలు



రూపం చూపించి, "నువు రోజూ అర్చించే దేవుణ్ణి ఇప్పుడు తిట్టుతావా, తిట్టవా?" అన్నాడు.

తన చేత అంత పాపం చేయించవద్దని శివానందుడు రాక్షసుడి కాళ్ళావేళ్ళా పడుతూ, బతిమాలాడు. కాని రాక్షసుడు ఒప్పుకోలేదు.

శివానందుడు తన దేవుణ్ణి రాక్షసుడు ఎలా తిట్టమంటే అలా తిట్టాడు. కామరూపుడు పెద్దగా నవ్వుకుని, అక్కడి నుంచి మాయమైపోయాడు.

మనుషుల భక్తి గురించి కూడా వాడికి తెలిసిపోయింది.

కామరూపుడు తిన్నగా వింధ్యాటవులకు వెళ్ళి, ఋషిని కలుసుకుని, "తమరు మానవజన్మ ఉత్తమమైనదని అన్నారు గాని, మనుషులు అవకాశవాదులు. వాళ్ళు సృష్టిలోని సమస్తజంతుజాలాన్నీ తమ అదుపులోకి తెచ్చుకుని, నాగరికత సృష్టించుకుని, హాయిగా జీవిస్తున్నప్పటికీ వాళ్ళ జీవితమంతా బూటకం! నాటకం! వాళ్ళు కోరి ఆచరించే పనులలో కూడా వాళ్లకు నమ్మకంలేదు," అన్నాడు.

"అయితే, ఏ జన్మ కోరుకుంటావు?" అని ఋషి అడిగాడు.

"మానవజన్మే!" అన్నాడు కామరూపుడు.

ఋషి ఆశ్చర్యపడి, కారణం అడిగాడు.

"ఎంత బూటకంగా జీవిస్తున్నా ఇది మానవుల కాలం. ఎన్ని శక్తులున్నా నాకు జీవితం మీద విరక్తిపుట్టింది. కాని మనుషులలో జీవితం మీద ఆశ ఉన్నది. వాళ్ళు చావంటే భయపడతారు. చావును దూరంగా ఉంచటానికి వాళ్లు తమ విశ్వాసాలన్నిటినీ విసర్జించగలరు. మనిషికి జీవించటంలో ఏదో ఆకర్షణ ఉన్నది. బతికి ఉన్నంతకాలమూ జీవనకాంక్ష ఉండే మానవజన్మ నాకు నచ్చింది," అన్నాడు కామరూపుడు.

ఋషి మంత్రజలం చల్లగానే వాడు చచ్చిపోయి, త్వరలోనే నగరంలో ఎక్కడో మనిషిగా పుట్టాడు.





# పరశురాముడు

ఋచీకుడి కొడుకూ, విశ్వామిత్రుడి మేనల్లుడూ అయిన జమదగ్ని ప్రసేనజిత్తు కుమార్తె అయిన రేణుకను పెళ్ళాడాడు. వారికి రుమణ్వంతుడూ, సుషేణుడూ, వసువూ, విశ్వావసువూ, రాముడూ అని అయిదుగురు కొడుకులు కలిగారు.

రేణుక ఒకసారి నీరు తీసుకు రావటానికి నదికి వెళ్ళి, అక్కడ చిత్రరథుడనే రాజు జలకాలాడుతూంటే చూసి సమ్మోహితురాలై, అక్కడే నిలబడిపోయి ఆలస్యం చేసింది. తరవాత భర్త ఏమంటాడో నని భయపడుతూ నీళ్ళతో తిరిగివచ్చింది.

జమదగ్ని రేణుకకూ, చిత్రరథుడికీ రంకుకట్టి, ఆమెను తీసుకుపోయి చంపమని తన కొడుకులను ఆజ్ఞాపించాడు. అయితే పెద్దవాళ్ళు నలుగురూ మాతృవధ చెయ్యమని తండ్రి ఆజ్ఞను నిరాకరించారు. కాని రాముడు తండ్రి ఆజ్ఞ ప్రకారం తల్లిని తీసుకుపోయి చంపి, చంపానని తండ్రికి చెప్పాడు.

జమదగ్ని అతని పితృవాక్య పరిపాలనకు సంతోషించి, ఏం వరం కావాలో కోరుకోమన్నాడు.

తన తల్లిని బతికించమన్నాడు రాముడు. జమదగ్ని అలాగేనని, రేణుకను తిరిగి బతికించాడు. అంతేగాక జమదగ్ని రాముడికి అపజయం అన్నది లేకుండా వరం కూడా ఇచ్చాడు.

ఈ రాముడే పరశురాముడు. ఇతని ఆయుధం గండ్రగొడ్డలి.

ఒకసారి పరశురాముడు తన తాతను చూడాలని కోరిక పుట్టి, ఋచీకుడి ఆశ్రమానికి వెళ్ళాడు. అతను అక్కడ కొన్నాళ్ళు ఉండి, ఔర్వుడి ఆశ్రమానికి వచ్చాడు. ఈ ఔర్వుడు భృగువంశానికి

చెందిన చ్యవనుడి కొడుకు. అక్కడ రాముడు కొంతకాలం ఉండి, ఔర్వుడి వద్ద సెలవు తీసుకుని, తన ముత్తాత (జమదగ్ని తాత) అయిన భృగుడి ఆశ్రమానికి వెళ్ళాడు. ఇతను దారివెంట వస్తూంటే చూసిన భృగుడిశిష్యులు ఇతని తేజస్సుకు కళ్ళు జిగేలుమని, కళ్ళు మూసుకున్నారట!

భృగుడు తన మునిమనవణ్ణి ఎంతో ప్రేమగా ఆదరించి, "బాబూ, నీకూ, మాకూ, లోకానికీ కూడా ఉపయోగపడే హితం చెబుతాను. అదేమిటంటే, నువు హిమాలయానికి వెళ్ళి, శివుణ్ణి గురించి తపస్సు చెయ్యి. అలా చేస్తే నీ కోరికలు ఫలిస్తాయి," అన్నాడు.

పరశురాముడు ఆయన చెప్పినట్టే హిమాలయానికి వెళ్ళి, తపస్సు ప్రారంభించాడు. తపస్సు చెయ్యటంలో అతని దృఢదీక్ష చూసి హిమాలయం మీద ఉండే మునులు ఆశ్చర్యపోయారు.

శివుడు అతన్ని పరీక్ష చెయ్యటానికి బోయవాడి రూపంలో అతని వద్దకు వచ్చి, గట్టిగా అరుస్తూ, "ఎవరు నువు? ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అని అడిగాడు.

పరశురాముడు కళ్ళుతెరిచి, వినయంగా ఆ ప్రశ్నలకు సమాధానం చెప్పాడు.

అయినా ఆ బోయవాడు వెళ్ళిపోలేదు. అప్పుడు పరశురాముడు, "అబ్బీ, నువు ఇక్కడే నిలబడి నా తపస్సుకు విఘ్నం కలిగించకు. కావాలంటే నువు కూడా



యిక్కడ కూర్చుని, నాతోబాటు తపస్సు చెయ్యి,'' అన్నాడు.

ఇద్దరికీ కొంత వాగ్వాదం జరిగింది. ఆ బోయవాడు మామూలు బోయవాడు కాదనీ, ఎవరో మహాత్ముడయి వుంటాడనీ గ్రహించి, పరశురాముడు అతని కాళ్ళ మీద పడ్డాడు.

శివుడు చాలా సంతోషించి, పరశురాముణ్ణి లేవనెత్తి, ''నాయనా, నువ్వింకా చిన్నవాడివి. రౌద్రాస్త్రాన్ని భరించే శక్తి నీ కింకా లేదు. అందుచేత కొంతకాలం తీర్థయాత్రలు చేసిరా,'' అని అంతర్ధానమయాడు.

దానిమీదట పరశురాముడు తపస్సు తాత్కాలికంగా కట్టిపెట్టి, తీర్థయాత్రలు చేసి, తిరిగి వచ్చి, మళ్ళా తపస్సు ప్రారంభించాడు.

ఇలా ఉండగా, ఇంద్రుడు దేవతలను వెంటబెట్టుకుని శివుడి వద్దకు వచ్చి, ''దేవా, దానవులు మా నగరాన్ని నాశనం చేస్తున్నారు. నువే మమ్మల్ని కాపాడాలి,'' అని వేడుకున్నాడు.

శివుడు మహోదరుడు అనే వాణ్ణి పిలిచి, పరశురాముణ్ణి తీసుకురమ్మన్నాడు. శివుడి పిలుపు విని పరశురాముడు శీఘ్రంగా వచ్చాడు.

''రామా, ఇంద్రుడి నగరాన్ని దానవులు నాశనం చేస్తున్నారట. నువు వెళ్ళి, దానవులను వెళ్ళగొట్టిరా.'' అన్నాడు శివుడు.



"దేవా, నీకు మాత్రం తెలియదా? దానవులు బలవంతులు. వాళ్ళను నేను ఎలా జయించను?" అని రాముడు శివుణ్ణి అడిగాడు.

అప్పుడు శివుడు పరశువును (గండ్ర గొడ్డలిని) రాముడికి ఇచ్చి, అతనిలో తన తేజస్సు ప్రవేశపెట్టాడు.

రాముడు ఇప్పుడు పరశురాముడై, ఇంద్రుడి నగరానికి వెళ్ళి, అక్కడ ఉన్న దానవులను తరిమికొట్టి, నగరాన్ని దేవతల పరంచేసి, తిరిగివచ్చి, యథా ప్రకారం తపస్సు కొనసాగించాడు.

శివుడు ఇతని భక్తికీ, దీక్షకూ మెచ్చి, ఇతనికి భార్గవాస్త్రాన్ని ప్రసాదించాడు.

పరశురాముడు హిమాలయం నుంచి కదలి, తన తల్లిదండ్రులను చూడటానికి బయలుదేరాడు. దారిలో ఒక పులి ఒక బ్రాహ్మణ బాలుడిపై పడబోతూ అతని కంటపడింది. బాలుణ్ణి రక్షించటానికి పరశురాముడు పులిని బ్రహ్మాస్త్రంతో కొట్టాడు. వెంటనే, దెబ్బతిని కిందపడిన పులి కాస్తా ఒక గంధర్వుడి రూపం ధరించి, పరశురాముడికి నమస్కారం చేసి, తాను శాపవశాన పులి అయాననీ, తనకు శాపం తీరిపోయిందనీ చెప్పి, గంధర్వలోకానికి వెళ్ళిపోయాడు.

పులి బారి నుంచి పరశురాముడు రక్షించిన కుర్రవాడి పేరు అకృతవ్రణుడు. అతను శాంతుడు అనే మునికి కొడుకు. ఆ కుర్రవాడు తీర్థయాత్రలు చేస్తూ దారి తప్పి, నిర్జనప్రదేశంలో పులికి దొరికాడు. తనను కాపాడిన పరశురాముణ్ణి అకృతవ్రణుడు జీవితాంతం సేవించి, శిష్యుడూ, స్నేహితుడూగా మసలుకున్నాడు.

అకృతవ్రణుణ్ణి వెంటబెట్టుకుని పరశురాముడు వరసగా భృగుడి ఆశ్రమానికీ, ఔర్వుడి ఆశ్రమానికీ, ఋచీకుడి ఆశ్రమానికీ వెళ్ళి, అక్కడి వారందరికీ సంతోషం కలిగించి, తన తల్లిదండ్రులను చూడబోయాడు. అతను తన కథ అంతా వాళ్లకు చెప్పాడు.

—(ఇంకా వుంది)





# పాపిష్ఠి దానం

పాండవుల సంతతికి చెందిన జనమే జయుడి కొడుకు శతానీకుడు, అనేక దేశాలు జయించి, ఆ దేశాలను తన రాజ్యంలో చేర్చుకుని, అపారమైన సంపద కూడబెట్టాడు.

ఆ డబ్బుతో శతానీకుడు బ్రాహ్మణులకు ఎడతెగని దానధర్మాలు చేసి, వారి ఆదరాభిమానాలు సంపాదించుకున్నాడు. వాళ్ళు అతన్ని వేనోళ్ళ దీవించారు.





శతానీకుడు చనిపోగానే అతని కొడుకు సహస్రానీకుడు రాజ్యానికి వచ్చాడు. అతను కూడా శౌర్యపరాక్రమాలు కల వాడే అయినా, తండ్రి లాగా దండయాత్రలు చెయ్యలేదు.



చనిపోయిన రాజు వద్ద అడపాదడపా దానాలు పుచ్చుకుంటూ వచ్చిన బ్రాహ్మణులు కొత్త రాజుతో అసంతృప్తి చెంది, పాత సంప్రదాయాన్ని కొనసాగించవలసిందిగా కోరారు.

"నా తండ్రికి ఆ సంప్రదాయం మేలు చేసిన పక్షంలో నేను దాన్ని కొనసాగించగలను," అన్నాడు సహస్రానీకుడు. దాన మహిమ శతానీకుడికి ఎలాటి ఫలితాల నిచ్చినదీ తెలుసుకుని చెప్పమని బ్రాహ్మణులు భార్గవమహర్షిని కోరారు.





భార్గవుడు సమాధిలోకి వెళ్ళిపోయి, తన ఆత్మశరీరంతో శతానీకుణ్ణి వెతుక్కుంటూ స్వర్గానికి వెళ్ళాడు. కాని స్వర్గంలో ఆయనకు శతానీకుడి జాడ తెలియరాలేదు.

తరవాత భార్గవుడు నరకానికి వెళ్లి చూడగా, శతానీకుడు అక్కడ యాతన పడటమేగాక, "నేను చేసిన పాపాలలో మొదటిది అక్రమంగా ధనం సంపాదించటం; రెండవది, సుఖాలలో ఓల
36 లాడుతున్న బ్రాహ్మణులకు దాన్ని దానం చెయ్యటం!" అన్నాడు.



37



భార్గవుడు సహస్రానీకుడి వద్దకు వెళ్ళి ఉన్న సంగతి తెలిపాడు; న్యాయార్జితమైన ధనాన్ని మాత్రమే దానం చెయ్యమనీ, అలా చేస్తే గాని అతని తండ్రి అయిన శతానీకుడికి ఉత్తమలోకాలు కలగవనీ అన్నాడు.

38

మర్నాడు సహస్రానీకుడు దేశాంతరం వెళ్ళి, అక్కడ శ్రామికుడుగా జీవిస్తూ ఒక ఏడాది గడిపి, కొద్దిపాటి ధనంతో తన రాజభవనానికి తిరిగి వచ్చాడు.





అతను తన సంపాదనను బ్రాహ్మణులకు దానం చేస్తూ, "ఈ దానం చాలా అల్పమైనది, కాని న్యాయార్జితమైనది. దయచేసి దీన్ని స్వీకరించి, నా తండ్రికి ఉత్తమలోకాలు కలిగేలాగా ఆశీర్వదించండి," అన్నాడు. బ్రాహ్మణులు అలాగే చేశారు.

తరవాత సహస్రానీకుడు తన ఖజానా తెరిపించి, తన తండ్రి పోగుచేసి ఉండిన ధనమంతా నిరుపేదలకూ, అనాథలకూ పంచి పెట్టేశాడు. తరవాత అతను భార్గవుణ్ణి పిలిచి, తన తండ్రి పరిస్థితి తెలుసుకోమని కోరాడు.







భార్గవుడు మరొకసారి నరకానికి వెళ్లాడు. శతానీకుడి పాపాలు పరిహారమై పోయాయి. అతను బంగారు రథంలో స్వర్గానికి బయలుదేరుతూ ఉండటం భార్గవుడు చూసి సంతోషించాడు.

# రాజ్యార్హుడు

ఒక రాజుకు ముగ్గురు కొడుకులు. తన అనంతరం రాజు కావటానికి వారిలో ఎవరు అర్హుడో తెలుసుకోవాలని, రాజు వారికి ఒక్కొక్కరికీ మూడేసి లక్షల వరహా లిచ్చి, "ఈ ధనంతో మీలో ఎవరు హెచ్చు సామర్థ్యం ప్రదర్శిస్తారో వారికి రాజ్యాభిషేకం చేస్తాను," అని వారికి ఆరు మాసాలు గడువిచ్చాడు.

ఆరుమాసాలు గడిచాయి. రాజు సభ చేశాడు. రాజు కొడుకులు ముగ్గురూ సభకు హాజరయారు.

"నేను నా డబ్బుతో శాస్త్రగ్రంథాలనూ, ధర్మగ్రంథాలనూ తయారుచేయించి ప్రజలకు ఉచితంగా అందజేస్తున్నాను," అన్నాడు పెద్దవాడు.

"నేను ఎప్పుడుపడితే అప్పుడు, ఎక్కడపడితే అక్కడ వాన కురిసే ప్రక్రియ నేర్చుకు వచ్చాను. మన దేశానికి నీటి ఎద్దడి ఉండదు," అన్నాడు రెండోవాడు.

"నా డబ్బుతో సేనాపతులనూ, దళాధిపతులనూ నా పక్షం చేసుకున్నాను. ఈ భవనాన్ని నా సేనలు చుట్టుముట్టి ఉన్నాయి. నాకు వెంటనే రాజ్యాభిషేకం చేయించండి," అన్నాడు మూడోవాడు.

ఆ రోజే వాడికి రాజ్యాభిషేకం జరిగింది.

— చాగాపురం నాగేశ్వరరావు





# దురాశాపరులు

సుబ్బయ్యశెట్టి చిల్లరకొట్టు వ్యాపారంతో బాటు, మేకలను కూడా పెంచేవాడు. అతని భార్యకు నగల పిచ్చి, చీరల పిచ్చీనూ. ఆవిడ కోసం మేకలు అమ్మగా వచ్చిన డబ్బు మాత్రమే శెట్టి ఉపయోగించేవాడు.

ఇలా ఉండగా ఏదో పండగ దగ్గిర పడింది. శెట్టి భార్యకు చీర కొనవలసి వచ్చింది.

శెట్టి ఒక మేకను అమ్మటానికి పొరుగూరు సంతకు తీసుకువెళ్ళాడు. అతను డబ్బు వ్యవహారాలలో ఇతరులను ఏమాత్రం నమ్మడు.

సంతరోజు అనుకోకుండా పెద్దవర్షం పడడం వల్ల జనం పలచగా ఉన్నారు. క్రయవిక్రయాలు మందంగా ఉన్నాయి. శెట్టి మేకకు పదిరూకల ధర కూడా పలకలేదు. ఇరవైకి తక్కువైతే అమ్మే ఉద్దేశం లేక, చీకటిపడినదాకా మంచిబేరం కోసం ఎదురుచూసి, చివరకు మేకను తీసుకుని నిరుత్సాహంగా ఇంటికి తిరుగుప్రయాణమయాడు శెట్టి.

అంతా కొండదారి. ఊరి దగ్గిర కొండ మలుపులో గుహ ఉన్నది. అందులో దయ్యాలుంటాయని చెప్పుకునేవారు. ఆ పరిసరాలకు చేరేసరికి శెట్టికి గుండె దడ పట్టుకున్నది. అసలే చీకటి గాఢాంధకారం!

శెట్టి గబగబా అడుగులు వేస్తూ ఆ మలుపు తిరగబోతూండగా, "ఎవరువారు? చీకటిపడి ఈవైపు రావడానికి ఎంత ధైర్యం!" అన్న మాటలు భయంకరంగా వినిపించాయి.

శెట్టి గజగజలాడిపోతూ, "నేను సుబ్బయ్యశెట్టిని! అమ్ముడుపోని మేకను ఇంటికి తోలుకుపోతున్నాను. అలస్య

మాచిరాజు కామేశ్వరరావు

మయింది. ఇంకెన్నడూ చీకటిపడి ఈ చాయలకు రాను,'' అన్నాడు.

''ఆ మేకను నా గుహలోకి తోలేసి, నీ దారిన నువు పో. మళ్ళా తెల్లవారేలోపుగా ఇక్కడికి వచ్చి దాని ఖరీదు పట్టుకుపో!'' అన్న మాటలు గుహలో నుంచి వినిపించాయి.

బతుకుజీవుడా అని శెట్టి తన మేకను గుహలోకి తోలేసి, గబగబా ఊరి కేసి నడిచాడు. కాని ఇంటికి వెళ్ళటానికి అతనికి ధైర్యం లేదు. డబ్బు ఏదని అతని పెళ్ళాం ప్రాణాలు తోడేస్తుంది. దయ్యం ఏమిస్తుందో, అది తీసుకుపోతేగాని ఆమె తనను ఇంట్లో అడుగుపెట్టనియ్యదు.

శెట్టి తూర్పు తెల్లవారేదాకా ఎవరి వీధి అరుగుమీదనో కాలక్షేపంచేసి, కాస్త ధైర్యం తెచ్చుకుని, కాళ్ళీడ్చుకుంటూ మళ్ళా గుహకేసి వచ్చాడు.

''మేక బాగా కొవ్వి, చాలా రుచిగా ఉన్నది! ఇదుగో దాని ఖరీదు!'' అన్న మాటలతోబాటు గుహలో నుంచి ఒక మూట వచ్చి శెట్టి కాళ్ళ ముందు పడింది. దాన్ని తీసుకుని, పరుగు లాటి నడకతో ఇల్లు చేరాడు, శెట్టి.

శెట్టి లోపలికి పోతూనే తలుపు మూసి, సంచీలో డబ్బంతా నేల మీద పోసి, లెక్క చూశాడు. యాభైరూకలు!



''ఆ డొక్కు మేకకు ఇంత డబ్బు పోసిన వెర్రిపీనుగు ఎవరబ్బా!'' అంటూ శెట్టి భార్య బుగ్గలు నొక్కుకున్నది.

''ఈ సంగతి ఎవరికీ చెప్పకుసుమా!'' అంటూ శెట్టి జరిగినదంతా తన భార్యకు చెప్పేశాడు.

శెట్టి భార్య కూడా, ''ఎవరికీ చెప్పకు సుమా!'' అంటూ ఈ విషయం పొరుగింటి పుల్లమ్మకు చెప్పింది. అది పుల్లమ్మ మొగుడికీ, ఎదురింటి వాడికీ, వెనకింటి వాళ్ళకూ, చివరకు ఊరందరికీ తెలిసిపోయింది.

మేకలున్న వారందరికీ పరమానందమయింది. మేకలు లేనివాళ్ళు, కొందరు

హెచ్చుధర ఇచ్చి మేకలను కొన్నారు. చీకటి పడేసరికి ఒకరికి తెలియకుండా ఒకరు దయ్యపుగుహలోకి తమ మేకలన్నీ తోలేసి, వచ్చేశారు. తన భార్య బాధపడ లేక, శెట్టి కూడా మరో పదిమేకలను గుహలోకి తోలి ఇంటికి వచ్చాడు.

తూర్పు తెల్లవారుతూండగా పాతిక మంది జనం గుహ బయట పొగుపడ్డారు. కాని ఎవరికీ మేకల ఖరీదు అందలేదు. కనీసం దయ్యం కంఠమైనా వారికి వినిపించలేదు.

తెల్లగా తెల్లవారిపోయింది.

అందరూ ధైర్యం చేసి గుహలోకి వెళ్ళారు. గుహలో ఒక్కమేక కూడా లేదు. కాని గుహ మధ్య బండ మీద ఒక కాగితం ఉన్నది. దాని మీద చిన్నరాయి బరువుపెట్టి ఉన్నది. ఆ కాగితం మీద ఇలా రాసి ఉన్నది:

"ఈ ఉత్తరం రాస్తున్నది దయ్యం కాదు, మీ లాటి మనిషే! పని కోసం మాసం రోజులుగా మీ చుట్టూ తిరిగిన శేషయ్యను నేను! మా నాన్న పోయాడు. ఇంట్లో ఉన్నదంతా కలిసి వందరూకలు. అవి తీసుకుని నేను మీ ఊరు వచ్చి మిమ్మల్ని పని అడిగితే, 'కొత్తవాడివి, నిన్ను నమ్మి పని ఎలా ఇస్తాం?' అన్నారు. ఉన్న డబ్బు సగం ఖర్చయింది. ఇంకో ఊరు పోదామని సాయంకాలం ఈ దయ్యం గుహలో పడుకున్నాను. మేకను తోలుకు వస్తున్న శెట్టిని చూశాక నాకీ ఊహ కలిగింది. మనిషిని నమ్మలేని మీరు దయ్యాన్ని నమ్మారు! లేని దయ్యం నాకు ఎంతో మేలు చేసింది. పని చేస్తానని వచ్చినవాడికి పైస కూడా విదవని మీరు, తేరగా డబ్బు వస్తుందనగానే, కట్టకట్టుకు వచ్చి పడ్డారు. మీ మేకల్ని అమ్మిన డబ్బుతో ఎక్కడైనా వ్యాపారం ప్రారంభించి ఏడాది లోపల మీ ఋణం తీర్చేస్తానన్న నమ్మకం నాకున్నది. అంతదాకా ఓపిక పట్టండి."

ఈ ఉత్తరం చదివించుకుని విన్న వాళ్ళంతా నోళ్లు వెళ్లబెట్టారు.



# చేవ్రాలు

సూర్యపురీ, చంద్రగిరీ మధ్య అరణ్యాలలో నంగడు అనే గజదొంగ స్వైరవిహారం చేస్తూండేవాడు. వాడి మనుషులు రెండు దేశాల దివాణాలలోనూ ఉండేవారని ప్రతీతి.

ఒకసారి చంద్రగిరి రాజు సూర్యపురి రాజును లక్ష బంగారు మొహరీలు అప్పు అడిగాడు. సూర్యపురి రాజు ఒప్పుకున్నాడు. మర్నాడే చంద్రగిరి ఆస్థాన కోశాధికారి డబ్బు తీసుకురావటానికి ప్రయాణమౌతున్నాడు. ఈ సంగతి తెలిసి నంగడు చంద్రగిరిలోని గురుకులానికి రాత్రిపూట వెళ్ళి; ఉపాధ్యాయుణ్ణి నిద్ర లేపి, తనకు కోశాధికారి సంతకం నేర్పకపోతే చంపుతానని భయపెట్టి, కోశాధికారి పేరు రాయటం నేర్చుకున్నాడు.

మర్నాడు చంద్రగిరి కోశాధికారి సైనికదళంతో అరణ్యమార్గాన సూర్యపురికి పోతూ నంగడి ముఠాకు దొరికాడు. కోశాధికారి వద్ద రాజముద్రికగల పత్రం ఉన్నది. అందులో రాజు ఋణం కోరుతున్నట్టుగా ఉన్నది.

నంగడు కోశాధికారినీ, సైనికులనూ బంధించి, కోశాధికారి దుస్తులు తాను ధరించి, సైనికుల దుస్తులు తన అనుచరులచేత ధరింపజేసి, సూర్యపురి దివాణానికి వెళ్ళాడు. చంద్రగిరి రాజు లేఖ చూడగానే నంగడికి లక్ష మొహరీలూ ఎంచి ఇచ్చి, సొమ్ము ముట్టినట్టు సంతకం తీసుకున్నారు.

నంగడు తాను నేర్చుకున్న సంతకం పెట్టి, వెంటనే సూర్యపురి రాజుకు తన అనుచరులతో సహా బందీగా పట్టుబడ్డాడు.

నంగడు రాసినది తన పేరే! అదే వాడికి గురువు నేర్పినది!

—ఎం. మనోహరరెడ్డి






# బ్రతుకుతెరువు

ఒక నగరంలో ఒక విద్యావంతుడు ఉండేవాడు. అతను గర్భదరిద్రుడు. అందుచేత అతను ఎలాగైనా రాజుగారి కొలువులో చిన్న ఉద్యోగం సంపాదించటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. అయితే అతనికి రాజదర్శనం కాలేదు సరేకదా, రాజుగారి దివాణంలో పనిచేసే ఉద్యోగుల ఆశ్రయం కూడా దొరకలేదు.

కాని తాను ఎలాగైనా బతకాలి. కూటి కొరకు కోటివిద్య లన్నారు. ఆ కోటిలో ఏదో ఒకటి ఎన్నుకుంటే తప్ప అతనికి పొట్టగడవదు.

ఒకరోజు అతను ఊరికి దూరంగానూ, అడవికి దగ్గరగానూ రెండు గోరీలు ఉండటం గమనించాడు. వాటి చుట్టూ పుట్టలూ, పొదలూ పెరిగి ఉన్నాయి. ఆ గోరీలను చూడగానే విద్యావంతుడికి ఒక ఆలోచన వచ్చింది. అతను శ్రమపడి గోరీల చుట్టూ పెరిగి ఉన్న పొదలను కొట్టేసి, చుట్టూ ఉన్న ప్రదేశం చదును చేసి, ముగ్గులు పెట్టి, గోరీల మీద తులసి మొక్కలు తెచ్చిపెట్టి, గోరీలను రోజూ పూలతో అలంకరించి, పూజిస్తూ రాసాగాడు.

ఊరి ప్రజలు ఊరి బయట దేవాలయానికి వచ్చినప్పుడూ, అరణ్యమార్గాన పొరుగూరికి పోయేటప్పుడూ ఈ గోరీలను చూసి, ఆశ్చర్యపడి ఆగి, అక్కడే కుటీరం వేసుకుని నివసిస్తున్న విద్యావంతుణ్ణి అడిగారు.

"ఇవి రాజుగారి పూర్వీకుల గోరీలు. శిథిలావస్థలో ఉండిన వీటిని చూసి, రాజవంశం మీది గౌరవం కొద్దీ వీటిని పునరుద్ధరించి, వీటి పోషణ చూస్తున్నాను. వీటికి పూజాపునస్కారాలు చేస్తున్నాను," అన్నాడు విద్యావంతుడు.

సూరిశెట్టి కృష్ణవేణి

అతని మాటలు ప్రజలు నమ్మారు. ఎందుకంటే గోరీలు చక్కగా వెల్లవేసి ఉన్నాయి. వాటిమీద తులసిమొక్కలూ, దీపారాధనా ఉన్నాయి. అవి నిజంగా రాజవంశం వారివి కాకపోతే ఈ మనిషి వాటిపట్ల అంత భక్తిశ్రద్ధలు ఎందుకు చూపుతాడు ?

ఊరి ప్రజలు కూడా ఆ గోరీల పట్ల శ్రద్ధాసక్తులు కనబరచి, దేవాలయానికి వచ్చినట్టుగా వచ్చి, గోరీల దీపారాధనకు చేతనైనంతలో నూనే, డబ్బులూ ఇయ్య సాగారు. వారిలో కొందరు భక్తితో గోరీలకు ప్రదక్షిణలు చేసి, కోరికలు కోరసాగారు.

గోరీలకు మొక్కుకుని, ప్రదక్షిణలు చేసినవారి కోరికలు తీరుతున్నాయని విద్యావంతుడు వచ్చే జనంలో చల్లగా ప్రచారం చేశాడు.

త్వరలోనే ఆ గోరీలు గొప్ప యాత్రా స్థలం అయాయి.

ఈ సమాచారం క్రమంగా రాజుగారి దాకా వెళ్ళింది. ఆ గోరీలు నిజంగా రాజ వంశానికి చెందినవో, కావో, రాజవంశానికి చెందినవే అయితే ఇంతకాలమూ ఎలా మరుగునపడిపోయాయో విచారించి తెలియపరచమని రాజుగారు మంత్రికి ఉత్తరువు ఇచ్చాడు.



మంత్రిగారు గోరీలను పరిశీలించి రమ్మని పరిశోధకులను పంపాడు. వాళ్ళు వచ్చి గోరీల మీద రెండు పేర్లు చెక్కి ఉన్న సంగతి తెలుసుకున్నారు. అవిగాక అక్కడక్కడ ఏవో చిహ్నాలు కూడా చెక్కి ఉన్నాయి.

ఆ వివరాల వల్ల వెంటనే ఏమీ తేల లేదు. రాజుగారు తమ వంశవృక్షం వివ రాలు తెప్పించి పరిశీలింప జేశాడు.

పధ్నాలుగు తరాల క్రితం ఆ గోరీల మీది పేర్లు గల భార్యాభర్తలు దేశాన్ని పాలించినట్టు స్పష్టమయింది. గోరీల మీద ఉండిన చిహ్నాలు కూడా ఆనాటి రాజ వంశపు చిహ్నాలే!

''మన వంశప్రతిష్ఠను తన స్వశక్తితో పునరుద్ధరించిన ఆ మనిషికి ఏమిచ్చినా మన ఋణం తీరదు,'' అని రాజు విద్యావంతుణ్ణి తన వద్దకు పిలిపించి, ''ఆ గోరీలు రాజవంశానివని ఏ ఆధారంతో కనిపెట్టగలిగావు?'' అని ఆసక్తిగా అడిగాడు.

''మహారాజా, నేనేమీ కనిపెట్టలేదు. మరోవిధంగా తమ దర్శనం లభించక, కంటపడిన గోరీలను బ్రతుకుతెరువుగా ఉపయోగించుకున్నాను. నా ఈ మోసం తమదాకా వస్తుందనుకోలేదు. నన్ను మన్నించండి. నా మోసం ప్రజలకు చెప్పకుని, మరొక బ్రతుకుతెరువు చూసుకుంటాను! గర్భదరిద్రుణ్ణి. నాకు విద్య అయితే అబ్బింది గాని, ఎంత ప్రయత్నించినా ధనం అబ్బింది కాదు!'' అన్నాడు విద్యావంతుడు.

''నువ్వు ఎవరినీ మోసగించలేదు. అవి రాజవంశపు గోరీలే. మధ్యకాలంలో రాజవంశంలో దీర్ఘకాలపు కలతలు సాగి, ఆ గోరీల విషయం పూర్తిగా మరుగున పడిపోయింది. తెలిసో తెలియకో నువ్వు వాటిని ఉద్ధరించి, మాకు చాలా మేలు చేశావు. నీకు అసలు రాజదర్శనం ఎందుకు కావలసివచ్చిందీ?'' అని రాజు అడిగాడు.

''చెప్పానుగదా, మహారాజా? కటిక దరిద్రుణ్ణి. నేను చదువుకున్న చదువు నాకు తమ కొలువులో చిన్నపాటి ఉద్యోగం ఇప్పిస్తుందేమోనని ఎంతగానో ఆశపడ్డాను. నా ఆశ తీరలేదు,'' అన్నాడు విద్యావంతుడు.

''నీ ఆశ తప్పక తీరుతుంది. నీకు నా కొలువులో మంచి జీతంతో ఉద్యోగంతో బాటు మాన్యం కూడా ఇప్పిస్తాను,'' అన్నాడు రాజు.

ఆ విధంగా, కాకతాళీయంగా, ఆ విద్యావంతుడు తన ఉదరపోషణ చూసుకునే ప్రయత్నంలో రాజవంశానికి గొప్ప మేలు చేసి, రాజాదరణకు పాత్రుడై ప్రసిద్ధికి వచ్చాడు.



# అత్యాశ

ఒక రోజు శెట్టి సంతకు బయలుదేరుతూంటే, కూలి చేసుకు బతికే రంగదాసు ఎదురు వచ్చాడు. ఆ రోజు శెట్టికి సంతలో చాలా లాభం వచ్చింది. రంగదాసు ఎదురుపడటం చేతనే లాభం వచ్చిందన్న సంతోషంతో శెట్టి రంగదాసుకు కొంత డబ్బిచ్చాడు.

ఆ సంగతి గ్రహించి రంగదాసు రోజూ శెట్టికి ఎదురు వచ్చేవాడు. రోజూ శెట్టికి అంతో ఇంతో లాభం వచ్చేది. శెట్టి రంగదాసుకు కొంత డబ్బు ఇచ్చేవాడు.

నిజంగానే తన మూలాన శెట్టి లాభ పడుతున్నాడనుకుని, రంగదాసుకు దురాశ పుట్టింది. ఒకనాడు వాడు శెట్టికి ఎదురువెళ్ళలేదు. ఆ రోజే శెట్టికి లాభం రాలేదు.

"ఇవాళ ఎదురు రాలేదేం?" అని శెట్టి అడిగాడు.

"నా వల్ల మీరు రోజూ లాభం పొందుతున్నారు. మీ లాభంలో నగం వాటా ఇస్తానని మునసబుగారి దగ్గిర ఒప్పందం చేసుకుంటేనే ఎదురు వస్తాను," అన్నాడు రంగదాసు.

శెట్టి సరేనని, వాడు కోరినట్టే చేశాడు.

ఒకనాడు అకస్మాత్తుగా వర్షం వచ్చి, శెట్టి సరుకంతా తడిసిపోయి చాలా నష్టం వచ్చింది. శెట్టి మునసబు దగ్గిరికి వెళ్ళి, తనకు నష్టం వచ్చిందనీ, అందులో నగం రంగదాసు అచ్చుకోవాలనీ అన్నాడు. విధిలేక రంగదాసు అచ్చుకున్నాడు!

—గంగ్రేటి పెంటయ్య





# దూరపుకొండలు

వెంకయ్య ఇంటికి బండ్లతో ధాన్యం వచ్చి చేరటం చూసి, వెంకయ్యకొడుకుతో పొరుగింటి అబ్బాయి ఆచారి, "మీదిరా రాజు లాంటి జీవితం! మీ కేం లోటురా? కావలసినంత పంట! కావలసినన్ని పాలు! లంకంత ఇల్లు!...." అన్నాడు సగం ఈర్ష్యగా.

వెంకయ్యకొడుకు రామం ఆ మాటకు నవ్వి, "ఒరే, ఆచారీ! నువు మాతోపాటు పొలంలో పని చెయ్యరాదూ? రోజుకు మూడురూపాయలు ముట్టే ఏర్పాటు చేస్తాను. ఏడాది పొడుగునా, అవసరం పడినప్పుడల్లా రా!" అన్నాడు.

రోజుకు మూడురూపాయ లనేటప్పటికి ఆచారికి ఆశపుట్టింది. తానుగా పనిచెయ్య నక్కర్లేదు. సహాయంగా వెళితే చాలు!

ఆ వేసవి అయిపోగానే, మృగశిరా ప్రవేశంలో ఆకు పోయించవలసివచ్చింది. రెండురోజులు బండి మీద వెళ్ళి, గొడుగు వేసుకుని ఎండలో నిలబడి, వెంకయ్యగారి ఆకు పోయించేశాడు ఆచారి. ఆ రెండురోజులకూ రామం ఆచారికి ఆరురూపాయలు ఇప్పించాడు. అంతే కాదు, ఎండవేళ, పొలం నూతిగట్టున పాలికాపు ఇచ్చిన కొబ్బరికాయ నీరు మహా తియ్యగా ఉన్నది.

మూడువారాల అవతల పొలం దమ్ము చేసే పని ప్రారంభమయింది. దగ్గిర ఉండి ఆ పని చేయించమని వెంకయ్యగారు ఆచారిని అడిగాడు. ఆచారి పొలంలోకి వెళుతుంటే చిన్న జల్లు పడింది. మళ్ల గట్ల మీదుగా జారుబురదలో పొలంలోకి వెళ్ళుతూ, దారిలో ఆచారి రెండుసార్లు జారిపడ్డాడు. రెండో రోజు అతను కర్రా, గొడుగూ పట్టుకుని, అతికష్టం మీద వెళ్ళగలిగాడు. వానాకాలం గదా,

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

ఎప్పుడు వర్షంపడేదీ తెలీదు. మొత్తం మీద వారం రోజులు కష్టపడి దమ్ము చేయించాడు అతను.

తరవాత మూడురోజులపాటు రోజూ వందమంది కూలీలను పెట్టి ఊడ్పులు చేయించవలసి వచ్చింది. ఆ పదిరోజులూ అతను రోజూ ఉదయం తొమ్మిది గంటలకు పోయి, సాయంకాలం ఆరు గంటలకు ఇల్లు చేరేవాడు. పదిరోజులకూ లెక్కపెట్టి ముప్ఫైరూపాయలు ఇచ్చేశాడు వెంకయ్యగారు.

నీళ్ళలో తిరగటం వల్ల ఆచారికి కాళ్లు ఒరిసిపోయి, దురదలు పట్టుకున్నాయి. వర్షంలో తడవడం వల్ల జలుబుచేసి, రెండురోజులు జ్వరం కూడా వచ్చింది.

వెంకయ్యగారి పొలంలో వేసినది అధిక దిగుబడి గల వరివంగడం కావటం వల్ల చేను తొంభై రోజులకే కోతకు సిద్ధమయింది. కోతలకు ఆచారిని సాయం రమ్మన్నారు. ఆచారీ, రామమూ వెంకయ్యగారూ పొలంలో మూడు ఇల్లారాలు వేసుకుని మూడు దిక్కులలో కాపలా పడుకునేవారు, రాత్రివేళ పనలు ఎవరూ పట్టుకుపోకుండా చూడడానికి.

చలికాలం కావటంవల్ల చర్మం చిట్లే చలి! ఇల్లారాలలోకి మంచు ప్రవేశించి, లోపల ఉన్నవాళ్ళను గజగజలాడించేది. కోతా, పనలు ఆరటమూ, కుప్పలు వెయ్యటమూ మొత్తం వారంరోజుల పని అయింది. ఆ వారంరోజులకు గాను



ఆచారికి పాతికరూపాయలు ముట్ట జెప్పారు.

వ్యవసాయదారులు ఏ విధంగా కష్ట పడేదీ ఆచారికి ఇప్పుడిప్పుడే బోధపడ సాగింది సాయంగా ఉన్నవాళ్ళకే ఇంత కష్టంగా ఉంటే, పనిచేసే రైతుల కింకా ఎంత కష్టమో ఆచారి ఊహించుకున్నాడు.

సంక్రాంతి పండుగ ముందు నూర్పులు జరిగినప్పుడు, ఒక పదిరోజులపాటు ఆచారి మళ్లీ వెంకయ్యగారి పొలానికి కాపు వెళ్ళవలసి వచ్చింది. కళ్ళంలో గింజలు దొంగతనం జరగకుండా చూడాలి.

ఒకనాటిరాత్రి ఎవరో దొంగలు పొలంలో ప్రవేశించి, కళ్ళంలో పనల అడుగునుంచి నాలుగు బస్తాల ధాన్యం తీసేశారు. వారి జాడ తెలిసి పాలేర్లూ, రైతులూ వారిపై దాడిచేశారు. దొంగలు బస్తాలు వదిలి పారిపోయారు.

నిజంగా వాళ్లు దొంగలు కారు, ఆచారిని భయపెట్టడానికి రామం నియమించిన మనుషులే వాళ్ళు.

బళ్ళు ధాన్యంతో ఇల్లు చేరాయి. ఆచారే దగ్గిర ఉండి ధాన్యాన్ని గాదెలలో పోయిస్తున్నాడు. రామం అతనితో, "ఒరే, ఆచారీ! ఎలా ఉందిరా వ్యవసాయం? కిందటేడు నువ్వేమన్నావో గుర్తుందా?" అన్నాడు.

"ఏదో బళ్ళతో ధాన్యం మీ ఇంటికి చేరటం చూశాను గాని, ఈ సాధక బాధకాలు ఇన్ని ఉన్నాయనుకోలేదురా. నీ ధర్మమా అని నాకు కొంత కష్టపడి పని చెయ్యటం అలవాటయింది." అన్నాడు ఆచారి.

రామం నవ్వుతూ, "దూరపు కొండలు నునుపురా! ఎంత కష్టపడితే ఇలా సుఖ పడుతున్నామో నీకు అర్థమయింది ఈనాటికి!" అన్నాడు.

ఆచారి ఊళ్ళో ఉన్న అందరు మోతు బరులకూ వ్యవసాయంలో సహాయ పడుతూ, తన పొట్టపోసుకోవటం నేర్చు కుని, తన కాళ్ళ మీద తాను నిలబడే స్థితికి వచ్చాడు.





# దేవీ భాగవతం

పూర్వం త్వష్టృప్రజాపతి దేవతలందరిలోకీ గొప్పవాడూ, గొప్ప తపస్సు చేసినవాడూనూ. ఆయన ఇంద్రుడిపై ద్వేషంతో మూడు తలలు గల విశ్వరూపుణ్ణి సృష్టి చేశాడు. విశ్వరూపుడు పెరిగి పెద్ద అవుతూ, మూడు తలలతోనూ మూడు వేరు వేరు పనులు చేస్తూంటే మునులందరూ మెచ్చుకునేవారు. అతను ఒక నోటితో వేదపఠనం చేసేవాడు, మరొక నోటితో కల్లు తాగేవాడు, మూడో ముఖంతో ప్రపంచంలో జరుగుతున్నదంతా గమనించేవాడు.

అలాటి విశ్వరూపుడు పంచాగ్నుల మధ్య తపస్సు చేశాడు. ఒంటికాలి మీదా, చలికాలం నీటిలోనూ, వేసవిలో అగ్నుల మధ్యా నిలబడి, నిరాహారుడై తపస్సు చెయ్యటం చూసి, అతను తన పదవి కాజెయ్యటానికి చూస్తున్నాడనుకుని, అతని తపస్సు భగ్నం చేయ నిశ్చయించి, ఇంద్రుడు తన సభకు వెళ్ళి, రంభా, ఊర్వశీ, మేనకలను పిలిపించి వారితో, "సుందరాంగులారా, మూడు తలకాయలవాడు నా సింహాసనం కోసం తపస్సు చేస్తున్నాడు. ఎలాగైనా అతని తపస్సు చెడగొట్టి, మీరు నన్ను రానున్న ఆపద నుంచి కాపాడాలి. చక్కగా అలంకరించుకుని, మీ నృత్య గాన కళలను వినియోగించి, ఆ విశ్వరూపుణ్ణి మన్మధుడి పాలపడవెయ్యండి," అని చెప్పాడు.

17. వృత్రుడి విజృంభణ



ఇంద్రుడు తమను దీనంగా అలా కోరుతూంటే, అప్సరలు అతనితో, "ఆ మునిని మా తళుకు బెళుకులతోనూ, ఓరచూపులతోనూ, క్షణంలో మాకు దాసుణ్ణి చేసుకుంటాం," అనేసి, విశ్వరూపుడి ఆశ్రమానికి వచ్చారు.

అప్సరలు తన ఎదట పాడుతూ, ఆడుతూ, చిత్ర విచిత్రాల అభినయాలు చేస్తూంటే, మూగవాడూ, గుడ్డివాడూ, చెవిటివాడూ అయినట్టుగా విశ్వరూపుడు కొంచెం కూడా చలించలేదు.

అప్సరలు కొన్ని రోజులపాటు ఆడి, పాడి, విశ్వరూపుడి మనోనిబ్బరానికి ఆశ్చర్యపడుతూ, ఇంద్రుడి వద్దకు తిరిగి వెళ్లి, "మా ప్రయత్నాలన్నీ ఆ ముని ముందు బూడిద పోసిన పన్నీరు అయాయి. ఎంత కవ్వించినా చలించడు! ఇంకా నయం! శాపం పొందకుండా తిరిగి రాగలిగాం!" అన్నారు.

ఇంద్రుడు మహాత్ముడైన ఆ విశ్వరూపుణ్ణి చంపటానికి నిశ్చయించాడు. అది ఎటువంటి మహాపాతకమో అతను ఆలోచించలేదు. అతను ఐరావతాన్నెక్కి, విశ్వరూపుడు తపస్సమాధిలో ఉన్న చోటికి వెళ్లి, ఆయన మీద వజ్రాయుధం ప్రయోగించి, చంపాడు.

అది చూసిన మునులు, "ఈ దేవేంద్రుడికి ఏం తెగులు పుట్టింది? అంతటి పుణ్యాత్ముణ్ణి చంపాడు! దీనికి ఇతను తప్పక అనుభవించి తీరుతాడు!" అన్నారు.

విశ్వరూపుణ్ణి చంపి, ఇంద్రుడు ఇంటికి వెళ్ళిపోయాడు. అయితే అతని మనసులో ఒక సందేహం మిగిలింది. చచ్చిపోయిన విశ్వరూపుడు మళ్ళీ బతకడు గద! ఎందుకంటే, వజ్రం దెబ్బ తిని చచ్చిపోయినాక కూడా విశ్వరూపుడిలో తేజస్సు అనర్గళంగా ఉన్నది.

ఈ అనుమానంతో ఇంద్రుడు వర్ధంగిని పిలిచి, "విశ్వరూపుడు చచ్చి కూడా జీవకళ ఉట్టిపడుతూ కనిపిస్తున్నాడు.

అతను మళ్ళీ బతకకుండా అతని తల కాయలు చెక్కెయ్యి.'' అన్నాడు.

దానికి వడ్రంగి, ''అదేమిటి ? ఇతను వజ్రాయుధం దెబ్బతో చనిపోయాడు. చచ్చినవాణ్ణి వధించి పాపం కట్టుకోనా ? నువ్వు నిష్కారణంగా ఈ మునిని ఎందుకు చంపావో నాకైతే తెలీదు. అయినా చచ్చి పోయిన వాడి తల నరకవలసిన పని ఏమిటి ? ఇంతకూ ఇతనంటే నీకెందుకు భయం ? '' అని అడిగాడు.

''ఇతను గొప్ప ముని అయితేనేంగాక, నాకు శత్రువు ! శత్రువును చంపటం విధి గనక చంపాను. చచ్చిపోయి కూడా బతికి ఉన్నట్టే కనబడ్డాడు. అగ్నిశేషమూ, ఋణశేషమూ, శత్రుశేషమూ ఉండ నియ్యరాదుగదా !'' అన్నాడు ఇంద్రుడు.

''నిరపరాధీ, బ్రహ్మతేజస్సుగలవాడూ అయిన ఇతన్ని చంపినందుకు నీకు బ్రహ్మహత్యాదోష భయంలేదా? '' అని వడ్రంగి అడిగాడు.

''నాకు శత్రుశేషం అంటే ఉన్న భయం బ్రహ్మహత్యాపాపం అంటే లేదు. ఆ పాపాన్ని ఎలాగైనా పోగొట్టుకోవచ్చు కాని శత్రుశేషానికి ప్రాయశ్చిత్తం లేదు గదా ! అందుచేత శత్రునిర్మూలనకు ఏ పాపమైనా చెయ్యవచ్చు.'' అన్నాడు ఇంద్రుడు.



''ఇటువంటి పాపిష్ఠి కార్యానికి నిన్ను లోభం పురిగొల్పిందేమో, నన్ను పురి కొల్పే లోభం ఏదీలేదే, నేనెందుకు యిలాంటి పాపం చెయ్యాలి ? '' అని వడ్రంగి అడిగాడు.

''నువ్వు అలా అనేటట్టుంటే, ఇక నుంచీ నీకు యజ్ఞంలో భాగం ఇప్పిస్తాను. యజ్ఞంలో బలి చేసే పశువు తల ఇక నుంచీ నీదే ! '' అన్నాడు ఇంద్రుడు.

ఆ మాట మీద వడ్రంగి తన గొడ్డలితో విశ్వరూపుడి తలలు నరికాడు. చిత్రంగా ఆ తలలు నేల మీద పడేటప్పుడు, ఒక్కొక్క తలనుంచి ఒక్కొక్క రకం పక్షులు అనేక వేల సంఖ్యలో బయటికి



వచ్చి, ఎగిరిపోయాయి. వేదం చదివే ముఖం నుంచి కపింజలాలు అనే పక్షులూ లోకాన్నంతనూ పరిశీలించే ముఖం నుంచి తీతువుపక్షులూ, కల్లుతాగే ముఖం నుంచి ఊరపిచ్చుకలూ వెలువడ్డాయి.

తన పని పూర్తి అయినట్టు తృప్తిపడి ఇంద్రుడు తనకు కలిగిన బ్రహ్మహత్యా పాతకానికి ప్రాయశ్చిత్తం చేసుకునే ప్రయత్నంలో ఉన్నాడు.

తన పుత్రుణ్ణి ఇంద్రుడు హత్య చేశాడని విని త్వష్టృప్రజాపతి మండిపడి, "ఒరే దేవతలారా, చూశారా? ఏ పాపమూ ఎరగకుండా తపస్సు చేసుకుంటున్న నా కొడుకును చంపిన ఇంద్రుణ్ణి నాశనం చెయ్యటానికి మహాబలుడైన కొడుకును పుట్టించబోతున్నాను!'' అని, అథర్వణ మంత్రాలతో అగ్నిని అర్చించి వ్రేల్చేసరికి, అగ్నిహోత్రుడికి తీసిపోకుండా ప్రకాశిస్తున్న కొడుకు పుట్టుకొచ్చాడు.

త్వష్ట వాణ్ణి చూసి, "పుట్టగానే సరి కాదురా! వెంటనే పెరిగి పెద్దవాడవై, ఇంద్రుణ్ణి హతమార్చెయ్యి!'' అని శాసించాడు.

చూస్తూండగానే ఆ శిశువు పర్వతాకారుడై, కాలమృత్యువులాగా కనబడి, దేవతలకు కంపరం కలిగిస్తూ, "నా పేరు ఏమిటి? నన్ను ఎందుకు పుట్టించావు? నీకుగల విచారం ఏమిటి? నీ మనసులోని కోరిక ఎంత అసామాన్యమైనదైనా సరే సాధిస్తాను. తండ్రి కోరిక తీర్చలేని కొడుకు కన్న హీనుడుండడు గదా!'' అని తన తండ్రిని అడిగాడు.

దానికి త్వష్ట "నీ పేరు వృత్రుడు. వేదతత్వం తెలిసినవాడూ, మూడుతలలు గలవాడూ అయిన మీ అన్నను చంపిన ఇంద్రుణ్ణి హతమార్చటానికి నువు పుట్టావు. ఆ పని చెయ్యి.'' అని వృత్రుడితో అని, రకరకాల ఆయుధాలు తయారుచేసి ఇచ్చి, రథం కూడా ఇచ్చి, మంచి ముహూర్తాన, బ్రాహ్మణాశీర్వాదాలతో సహా ఇంద్రుణ్ణి చంపటానికి పంపాడు.

వృత్రుణ్ణి గురించిన ఈ వార్త ఇంద్రుడికి వెంటనే చేరింది.

"త్వష్టృప్రజాపతి నిన్ను చంపటానికి పర్వతాకారుడైన వృత్రుణ్ణి సృష్టిచేసి పంపాడు. అతను బలవంతులైన రాక్షసులను వెంటబెట్టుకుని వస్తున్నాడు," అని దూతలు ఇంద్రుడితో అంటూండగానే, వృత్రుణ్ణి స్వయంగా చూసి బెదిరి పారిపోయి వచ్చిన దేవతలు ఇంద్రుడితో ఇలా అన్నారు:



"దేవా, అతి భయంకరమైన దుశ్శకునాలు తమ పురంలో కనిపిస్తున్నాయి. కాకులూ, గుడ్లగూబలూ, రాబందులూ కూస్తున్నాయి. ఇళ్లమీద రాక్షసుల అరుపులు వినిపిస్తున్నాయి. స్త్రీలకు పీడకలలు వస్తున్నాయి."

ఈ అశుభాలు విని ఇంద్రుడు భయపడి బృహస్పతితో, "ఈ దుశ్శకునాలకు శాంతి ఏమిటి?" అని అడిగాడు.

"ఉత్తపుణ్యానికి నిరపరాధుడైన మునిశ్రేష్ఠుణ్ణి చంపి ఏం బావుకున్నావు? ఆ పాపం నిన్ను కట్టి కుడపకుండా వదిలిపెట్టుతుందా? ఏదైనా చేసేటప్పుడు ముందూ, వెనకా ఆలోచించి మరీ చెయ్యాలి. లేకపోతే జీవితం కష్టాల పాలవుతుంది. మోహలోభాలకు వశుడివై బ్రహ్మహత్య మెడకు చుట్టుకున్నావు. పెద్ద ఎత్తున చేసే పుణ్య. పాపాలకు ఫలితం వెంటనే కనబడుతుంది. ఇతరులను పీడించే వాడికి సుఖం ఉండదు. నీకు కష్టకాలం ఆసన్నమయింది. ఈ వృత్రుడు మహాబలవంతుడు. తేలికగా చావడు. వాడికి త్వష్ట ఆయుధాలు కూడా ఇచ్చాడు. వాటిలో ఏ ఒకదానికీ నీ వజ్రం సరిరాదు. వాడి ధాటి చాలా గొప్పది," అన్నాడు బృహస్పతి.

దేవేంద్రుణ్ణి హతమార్చటానికి వృత్రుడు వస్తున్నాడని విని, మునులూ, యక్షులూ, దేవతలూ కంగారుగా పారిపోయారు. అలా ఇళ్లూ, వాకిళ్లూ విడిచి పారిపోతున్న దేవతలను చూసి ఇంద్రుడు



విచారంతో తన సేవకులను పిలిచి, ''రుద్రులనూ, ఆదిత్యులనూ, వసువులనూ, దిక్పాలకులనూ విమానాల మీద యుద్ధానికి రమ్మని పిలవండి.'' అన్నాడు.

ఇలా అని, ఇంద్రుడు బృహస్పతిని కూడా తన ఏనుగు మీద ఎక్కించుకుని, యుద్ధానికి తరలాడు. అతని వెనక ఆయుధాలతో సహా దేవతలు కూడా వెళ్ళారు. వృత్రుడు కూడా దానవసేనలను వెంట బెట్టుకుని వచ్చాడు. ఉభయపక్షాలూ మానససరస్సుకు ఉత్తరాన ఉన్న పర్వతం మీద సంఘటించాయి.

నూరు సంవత్సరాలపాటు యుద్ధం సాగింది. దానిమూలంగా లోకాలన్నీ బాధపడ్డాయి. ముందు వరుణుడు పారిపోయాడు. తరవాత క్రమంగా వాయుగణాలూ, యముడూ, కాంతి నశించిన అగ్నీ నిష్క్రమించారు. ఇంద్రుడు పలాయనం చెయ్యక తప్పలేదు. దేవతలనందరినీ జయించి, వృత్రుడు తండ్రి వద్దకు వెళ్ళి, నమస్కారం చేసి, ''అందరూ ఓడి, భయపడి పారిపోయారు. భయపడ్డవాళ్ళు అని ఎవరినీ చంపలేదు. ఇంద్రుడు కాలిసత్తువకొద్దీ పరిగెత్తిపోతే, అతని ఏనుగును తెచ్చాను. దీన్ని నువు కానుకగా తీసుకో. ఇంకా ఏం చెయ్యాలో చెప్పు, ఎంత కష్టమైనా చేస్తాను.'' అన్నాడు.

త్వష్ట తన కొడుకును చూసి చాలా సంతోషించి, ''నాయనా, నీ పరాక్రమం సాటిలేనిది. మళ్ళీ నలుగురిలో తల ఎత్తుకు తిరగగలను. నా మనోవేదన పోయి, జీవితం ఫలించింది. నాకు స్థిమితం కలిగింది. ఇక నువు చెయ్యవలసినపని చెబుతాను, విను. ఇంద్రుణ్ణి నమ్మరాదు. అతను చేసే ఇంద్రజాలాన్ని లక్ష్యపెట్టక, బ్రహ్మను గురించి తపస్సు చేసి, చావు లేనివాడివై, ఇంద్రుణ్ణి పరిమార్చు. తపస్సుతో సాధించరానిది ఏదీ లేదు. ఆ దుర్మార్గుడు అకారణంగా నా కొడుకును చంపాడన్న సంగతి

మనసులో నుంచి పోకుండా ఉన్నది. ఆ ఇంద్రుణ్ణి అంతం చెయ్యి,'' అన్నాడు.

వృత్రుడు తండ్రి వద్ద సెలవు పుచ్చుకుని, క్రోధావేశంతో గంధమాదన పర్వతం మీదికి వెళ్లి, గంగలో స్నానాలు చేస్తూ, దర్భచాప మీద ఉండి, అన్ని రకాల ఆహారమూ త్యజించి, యోగం అవలంబించి, మునులకు అద్భుతమనిపించేలాగా బ్రహ్మను గురించి తపస్సు చేశాడు.

ఇంద్రుడికి దడపుట్టింది. తనకు చేతనైనది తపోభంగం చెయ్యటం. అందుకుగాను అతను అప్సరలను పంపాడు. వాళ్ళ చేష్టలు వృత్రుడి మీద పనిచెయ్యలేదు. వాళ్ళు విచారంగా ఇంద్రుడి వద్దకు తిరిగివెళ్ళి, వృత్రుడి తపస్సు చెడగొట్టటం తమ శక్తికి మించిన పని అని చెప్పారు.

చివరకు వృత్రుడి తపస్సుకు బ్రహ్మ సంతోషించి, ప్రత్యక్షమై, ''ఇంక నీ తపస్సు చాలించి, నీకు ఏం కావాలో అడుగు,'' అన్నాడు.

వృత్రుడు బ్రహ్మకు చేతులు జోడించి, "దేవా, ఇదివరకే ఇంద్రపదవి సంపాదించి ఎంతో సంతోషించాను. ఇవాళ నీ దర్శన భాగ్యం లభించటం అంతకంటె ఎంతో ఎక్కువకదా! ధన్యుణ్ణి! నేను కోరిన వరం ఇయ్యదలిస్తే, లోహాలవల్ల గాని, కర్రలవల్ల గాని, ఎండిన, ఎండని వెదురు వస్తువులతో గాని, ఇతర ఆయుధాలచేత గాని నాకు చావు లేకుండా వరం ఇయ్యి. యుద్ధం సాగినకొద్దీ నా శక్తి పెరిగేటట్టు వరం ఇయ్యి,'' అన్నాడు.

బ్రహ్మ అతను కోరినవరం ఇచ్చి వెళ్లిపోయాడు.

వృత్రుడు పరమానందంతో తన తండ్రి వద్దకు తిరిగివెళ్ళి, జరిగినదంతా ఆయనకు చెప్పాడు.

''నాయనా, నీకు శుభం! నీ అన్నను, విశ్వరూపుణ్ణి, అకారణంగా చంపి, బ్రహ్మహత్యాపాతకం మెడకు చుట్టుకున్న ఆ ఇంద్రుణ్ణి ఇప్పుడు నిర్భయంగా చంపెయ్యి,'' అన్నాడు త్వష్ట.



# అత్తగారి గది

రాంపురం గ్రామంలో రాజయ్య గ్రామాధికారి పొలం కౌలుకు చేసుకుంటూ, చాలా డబ్బు వెనకవేసి, సొంత ఇల్లు కట్టుకొన నిశ్చయించాడు. ఆ సందర్భంలో రాజయ్య భార్య సుశీల, ఇంటికి కొంచెం ఎడంగా ఒక చిన్న గది కట్టించమన్నది. అది ఆమె అత్తగారి కోసం! ఆ సంగతి గ్రహించి కూడా రాజయ్య ఒప్పుకున్నాడు.

అయితే ఇల్లు కట్టటం పూర్తికాకముందే రాజయ్య తల్లి చనిపోయింది. ఆమె కోసం కట్టించిన గదితో పనిలేకపోయింది. అది అలా ఉండగా, తన పొలం మీద రాజయ్య ఇంత సంపాదించాడా అని గ్రామాధికారికి కన్నుకుట్టి, తన చేను తాను స్వాధీనంచేసుకున్నాడు. చిన్న వాళ్ళ పొలాలు చెయ్యడం ఇష్టంలేక రాజయ్య, తన కొత్త ఇల్లు అద్దెకిచ్చి, మరో గ్రామానికి తరలిపోయాడు.

కాలక్రమాన రాజయ్య కన్నుమూశాడు. రాజయ్య కొడుకు పెద్దవాడై, పెళ్ళిచేసుకున్నాడు. సుశీల తన కొడుకునూ, కోడలినీ తీసుకుని రాంపురంలో సొంత ఇంటికి తిరిగివచ్చింది.

సుశీల కోడలు ఇల్లంతా చూసి, "అత్తయ్యా, మామయ్యగారు ఇల్లు చాలా బాగా కట్టించారు. అయితే నువు ఒంటరిగా ఆ మూలగదిలో ఉంటావని ఆయనకు అప్పుడే ఎలా తెలిసింది?" అని అడిగింది.

సుశీల నోట మాట లేదు!

— ఎస్. అగ్గర్వాల్





# నాలుగో దొంగ

ఒక దేశంలో ముగ్గురు గజదొంగ లుండే వారు. వారు రోజుకొక దొంగతనం చేసినా వారిని పట్టటం ఎవరికీ సాధ్యంకాలేదు. వాళ్ళ పేరు చెబితే ధనికులకు సింహ స్వప్నంగా ఉండేది. వాళ్ళను ఏ విధంగా నైనా పట్టాలనే ఉద్దేశంతో ఆ దేశపు రాజు ప్రతి రాత్రి తాను కూడా ఒక దొంగ లాగా వేషం వేసుకుని, నగరం నాలుగు మూలలూ తిరగసాగాడు.

ఈ విధంగా కొన్ని రాత్రులు తిరగగా, తిరగగా ఒక చీకటిరాత్రి రాజుకు దొంగ లుండే స్థలం చిక్కింది. రాజు అక్కడికి చేరుకునేసరికి ఆ దొంగలు ఆ రాత్రి తాము చేయదలచిన దొంగతనం గురించి ఆలోచిస్తున్నారు.

కొత్త దొంగను చూడగానే గజదొంగ లకు కొంత అనుమానం కలిగింది. వాళ్ళు రాజు కేసి కోపంగా చూస్తూ, "ఎవరు నీవు? ఇక్కడికి ఏం పనిమీద వచ్చావు?" అని అడిగారు.

"నేనూ దొంగనే. ఈ ప్రాంతాల మీరు చాలా గొప్ప దొంగలని విని మీకు నా శక్తి ఎలాంటిదో చూపించ వచ్చాను," అన్నాడు రాజు.

దొంగలు నవ్వి, "మా శక్తులను గురించి నీ కేమైనా తెలుసా?" అని అడిగారు.

"తెలియదు. నేను యీ ప్రాంతాలకు కొత్తవాణ్ణిగదా, చెప్పండి, వింటాను!" అన్నాడు రాజు.

"నేను ఎంత లావు తాళాన్నయినా పూచికపుడకతో తీయగలను," అన్నాడు మొదటి దొంగ.

"నేను భూమికి చెవి పెట్టి ఆలకించా నంటే డబ్బు ఎక్కడ ఉన్నదీ పసికట్ట గలను," అన్నాడు రెండో దొంగ.

''ఒకసారి చూసిన మనిషిని నేను ఏ మారువేషంలో ఉన్నా పోల్చుకో గలను.'' అన్నాడు మూడో దొంగ.

''మా శక్తుల సంగతి చెప్పాం. నీకు గల శక్తి ఏమిటి?'' అని ముగ్గురు దొంగలూ రాజును అడిగారు.

ఏం చెప్పాలో రాజుకు తోచలేదు. అందుచేత ఆయన ఈ విధంగా అన్నాడు:

''నేను బొటనవేలు కిందికి దించానంటే ఎవరినైనా యమలోకానికి పంప గలను. చూపుడువేలు పైకి ఎత్తానంటే చావటానికి సిద్ధంగా ఉన్నవాళ్ళు కూడా బతికి బయటపడతారు.''

ఈ మాట విని ముగ్గురు దొంగలూ సంతోషించారు. తమ అంత శక్తిసామర్థ్యాలు కలవాడూ, తెలివైనవాడూ తోడు వచ్చాడనుకున్నారు.

''ఈ రాత్రి ఎక్కడికి దొంగతనానికి పోదాం?'' అని అడిగాడు రాజు.

''నీ యిష్టం! నువు కోరుకున్నచోటికి పోదాం. మా శక్తిసామర్థ్యాలు స్వయంగా చూతువుగాని!'' అన్నారు దొంగలు.

''అయితే, రాజుగారి ఖజానా కొల్లగొడదాం!'' అన్నాడు రాజు.

నలుగురూ కలిసి రాజప్రాసాదానికి బయలుదేరారు. పహరావాళ్ళ కంటపడకుండా లోపలికి చేరారు. రెండో దొంగ నేలకు చెవిపెట్టి ఆలకించి, ''ఖజానా ఈవైపుగా వుంది, జాగ్రత్తగా నడవండి!'' అని చెప్పాడు.



నలుగురూ అటుకేసి వెళ్ళారు. ఖజా నాకు పెద్దతాళం వేసివుంది. కాని దాన్ని మొదటి దొంగ క్షణంలో ఊడదీశాడు. దొంగలు లోపల ప్రవేశించారు.

ఈ సమయంలో రాజు వాళ్ళకు తెలియకుండా వెళ్ళిపోయి తన భటులను పంపాడు. గజదొంగలు ముగ్గురూ సొత్తుతో సహా పట్టుబడ్డారు.

మర్నాడు వారిని విచారణకు దర్బారుకు తెచ్చారు. సింహాసనం మీద కూర్చున్న రాజును చూస్తూనే మూడో దొంగ తన తోటివాళ్ళతో, "ఈయనే నిన్న మనతో దొంగతనానికి వచ్చిన కొత్త మనిషి!" అని చెప్పాడు.

విచారణ అంతా అయిపోగానే రాజు తన కుడిచేతి బొటనవేలు కిందికి తిప్పాడు. గజదొంగలకు మరణశిక్ష విధించబడింది.

మర్నాడు ఉదయం వారిని ఉరికంబం వద్దకు తీసుకుపోయారు. అధికారి, "చెప్పండి! మీ ఆఖరు కోరిక ఏమిటి?" అని దొంగలను అడిగాడు.

"రాజుగారిని ఒక ప్రశ్న అడగాలి. అదే మా ఆఖరు కోరిక!" అన్నారు దొంగలు.

అధికారి యీ సంగతి చెప్పగానే రాజుగారు వచ్చాడు.

"మీరు నన్నడగగోరే ప్రశ్న ఏమిటి?" అన్నాడాయన.

"మరేంలేదు, మహాప్రభూ! మా శక్తులు మీకు ప్రదర్శించాం. మీ శక్తులను గురించి మాకు రెండు విషయాలు చెప్పారు. అందులో ఒకటే ప్రదర్శించారు. రెండవది కూడా చూసి సంతోషించాలని మా కోరిక!" అన్నాడు మూడో దొంగ.

రాజు చిరునవ్వు నవ్వి తన చూపుడు వేలు పైకెత్తాడు. వెంటనే రాజభటులు వచ్చి గజదొంగల కట్లు విప్పేసి, ఉరి కంబం నుంచి దించేశారు.

తరువాత ఆ గజదొంగలు దొంగతనాలు చేయటం మాని రాజు దగ్గిరే కొలువుంటూ, రాజుగారి పట్ల ఎంతో భక్తిగా కాలం గడిపారు.

65



# బుద్ధి వచ్చింది!

బాలయ్య తన కొడుక్కు పదివేలు కట్నం తీసుకుని చంద్రయ్య పెద్దకూతుర్ని చేసుకున్నాడు. ఆ పెళ్ళి జరిగిన పదిసంవత్సరాలకు చంద్రయ్య తన రెండో కూతురికి పదిహేనువేల కట్నంతో పెళ్ళి చేశాడు.

అదిచూసి బాలయ్య చంద్రయ్యతో, "నా కొడుకు ఏం తీసిపోయాడు? వాడిక్కూడా ఇంకో అయిదువేలు ఇయ్యి. లేదా, నీ కూతుర్ని తీసుకుపో," అన్నాడు.

చంద్రయ్య ఏం చెయ్యాలో తోచక గ్రామాధికారితో చెప్పుకున్నాడు.

గ్రామాధికారి బాలయ్యను పిలిపించి, "చంద్రయ్య నీకు ఇంకా అయిదువేలు ఇయ్యాలన్నావుట గదా? నీ కొడుకు కట్నం కింద పదేళ్ళ క్రితం ఇచ్చిన పదివేలు ఇప్పటికి వడ్డీతో సహా ఇరవైరెండువేలు అవుతాయి. నువే చంద్రయ్యకు ఏడువేలు బాకీ ఉన్నావు," అన్నాడు.

ఆ మాటతో బాలయ్యకు బుద్ధివచ్చింది.

— యండపల్లి పాండురంగ



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1980 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.







A. L. Syed A. L. Syed

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఫిబ్రవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : జాలరి బిడ్డ

రెండవ ఫోటో : జమీందారి బిడ్డ

పంపినవారు : వై. రమేష్, రత్నంనివాస్, మొండేటి స్ట్రీట్, శ్రీకాకుళం.

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

The stories, articles and designs contained herein are exclusive property of the Publishers and copying or adopting them in any manner will be dealt with according to law.

5 సంవత్సరాలు గ్యారంటీ గల మెరీ సూపర్ స్పెషల్ బంగారు కవరింగ్ నగలను 15 సంవత్సరాల పరిశోధన ఫలితంగా – భారత దేశంలో ప్రప్రథమంగా తయారు చేస్తూ, దేశమంతటా విరివిగా వి. పి. పి. ద్వారా పంపే సంస్థ. ఉచితంగా కేటలాగ్ పొంది అన్ని వివరాలు చూడగలరు. ఇందులోని సంఖ్యలు సూచిస్తూ, ఉత్తరం రాస్తే, వీ. పి. పి. ద్వారా వస్తువులు పంపబడతాయి.

(వి. పి. పి. చార్జీలు అదనం)




# MERI GOLD COVERING WORKS

**14, RANGANATHAN STREET, T. NAGAR, POST BOX No. 1405, MADRAS-600 017**

---

## WANTED

దేశమునందలి ఆర్థిక పరిస్థితులను పెంపొందించుటకు, నిరుద్యోగ సమస్య నివారించుటకు ఈ క్రింది ఉద్యోగములు చేయుటకు Agro Sales Representative, Depot Asst. Agro Clerks, Village Development. Officers Beekeeping Maistry, Compost Inspectors Sugar Cane Inspectors, Sugar Cane Asst. Field Man, Field Maistry, Garden Supervisors, Agri Teachers, Agri Asst. Demonstrators మొదలయిన ఉద్యోగములకు శిక్షణ ఇవ్వబడుచున్నది. శిక్షణాకాలము మూడు మాసములు. విద్యార్హత VIII Pass S.S.C., S.S.L.C., B.A., B.Com., B.Sc./Pass or Failed అయి ఉండవచ్చును. అభ్యర్థులు తెలుగు, మలయాళం, కన్నడ, ఉర్దూ, తమిళం ఏదైనా ఒక మాతృభాష అయి ఉండవలయును. వయస్సు 1951వ సం॥ము నుండి 1964 సం॥ లోపల జన్మించిన పురుషులు లేక స్త్రీలు అర్హులు. ఎన్నికైన అభ్యర్థులకు ST వారికి SC వారికి 150 రూ. చొ॥న BC వారికి 130 రూ॥ చొ॥న మిగతా వారికి 120 రూ. చొ॥న ఉపకార వేతనం ఇవ్వబడును. దూర ప్రాంతముల నుండి వచ్చు విద్యార్థులకు, స్త్రీ, పురుషులకు ప్రత్యేక వసతి గృహములు ఇవ్వబడును. భోజన వసతులు కూడ గలవు. విద్యార్థులకు కావలసిన పుస్తకములు, తదితర వస్తువులు మరియు విహారయాత్ర ఉచితముగా కల్పించబడును. ప్రభుత్వ పరీక్షయందు ఉత్తీర్ణులైన వారికి విద్యార్హతనుబట్టి పై ఉద్యోగములు నిర్ణయించబడును. 380 రూ॥ నుండి 450 రూ॥ జీతము పొందవచ్చును. శిక్షణ యందు చేరుటకు దరఖాస్తు ఫారము కోరువారు 30 రోజుల లోపల 2 రూ॥ M. O లేక (NOT CROSSED) పోస్టల్ ఆర్డర్ ద్వారా పంపి పొందవచ్చును.

*Principal*

**COLLEGE OF SOUTH INDIAN AGRICULTURAL TECHNICAL TRAINING CENTRE**

136, Bhaskar Colony, Virugambakkam MADRAS - 600 092

"రాజుకు పాలు అంటే ఒకప్పుడు అయిష్టం... నేను న్యూట్రామూల్ కలిపి యిచ్చినప్పట్నించీ మహా యిష్టం"



# "మరిప్పుడు వాడు న్యూట్రామూల్ మొనగాడు"




పిల్లలు పాలు తాగటానికి మారాం చేస్తున్నారా? లేదు, అంటున్నారు రుచికరమైన న్యూట్రామూల్ కి దీవనలిచ్చే అసంఖ్యాకమైన తల్లులు. రుచికి రుచీ, బలానికి బలం, న్యూట్రామూల్‌లో కోకో, పాలు, మాల్ట్ లతో పుష్టి వుంది – బలే రుచి. మరి దీన్లో ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజాలూ వున్నాయి. పెరుగుతూన్న దశలోని శరీరానికి పుష్టినిచ్చేవి యివి. సువాసనతో నిండిన న్యూట్రామూల్ ప్రతి కప్పూ ఎంతో పోషణని యిస్తుంది.



మార్కెట్ చేయువారు :
గుజరాత్ కో-ఆపరేటివ్
మిల్క్ మార్కెటింగ్
ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్, గుజరాత్

అమూల్
## న్యూట్రామూల్ ప్రతి కప్పు మీకు పోషణను ఇచ్చు!

daCunha-GCM-16 TL

66

# రాజు ముఖానికి ముసుగు

ఆవేళ రాజుయొక్క చిట్టి చెల్లెలు మీనా పుట్టిన రోజు.
ఆది రాజుకి గొప్ప సంతోషాన్నిచ్చే శుభ సమయం.
నందు, వినయ్, రేఖ, అశోక్ -అందరూ అందమైన
కానుకలను తెస్తామన్నారు:
రాజుకి ఏం కానుక యివ్వాలో తోచలేదు.
అతను చాలా, చాలా చాలా ప్రత్యేకమైన కానుకను
ఇవ్వాలనుకున్నాడు. ఆలోచించాడు, ఆలోచించాడు,
ఆలోచించాడు ఏమివ్వాలా అని.
ఉన్నట్టుండి అతనికి ఓ అయిడియా తట్టింది.
ఆ! ముసుగు. అందంగా, రంగులుచిందే ముసుగుపైన
పచ్చని చారలు, బుగ్గలపై గులాబిరంగు, కెంపువన్నె
పెదవులు—ఒక్క క్షణంలో కార్డ్‌బోర్డ్ మీద బ్రష్‌తో
ముసుగు బొమ్మను పెయింట్ చేసి, ముసుగులా
ఉండేలా కత్తిరించాడు.
అబ్బ ఎంత అందమైన కానుక, అది చూసి మీనా
మురిసిపోయింది.
ప్రతివారూ రాజు గురించి, రాజు ఇచ్చిన అద్భుతమైన
కానుక గురించే మాట్లాడారు.
మరి రాజు అలా పెయింట్ చేయగలిగితే
మీరూ చెయ్యగలరు మరి.

## కెమెల్
వాటర్ కలర్స్
& పోస్టర్ కలర్స్






కేమ్లిన్ ప్రైవేట్
లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్స్
డివిజన్ జె.బి. నగర్
బొంబాయి 400 059.

కేమ్లిన్ అన్‌బ్రేకబుల్ పెన్సిళ్ళ ఉత్పాదకులనుండి

VISION 791TEL

CHANDAMAMA (Telugu) FEBRUARY 1980 Regd. No. M. 4854

# రామ్ శ్యామ్

పిల్లల్ని ఎత్తుకుపోయేవాణ్ణి పట్టేసారు!






















నోరూరించే
మనసుదోచే
మైమరపించే




పాపిన్స్ పండ్లరుచిగల పిప్పరమెంట్లు




5 పండ్ల సువాసనలలో- రాస్ప్‌బెరి, అనాస, నిమ్మ, నారింజ, మోసంబి.

everest/79/PP/262-tel.